


# గుణదోషప్రకాశికా

## తత్త్వబోధిని.



ఇది

తోపల్లి వేంకటరామసిద్ధాంతికృతము.



విశాఖపట్టణము:

శ్రీ శారదామకుటముద్రాక్షరశాలలో

ముద్రితము.

1914



శ్రీమాతే నమః.

# గుణదోషప్రకాశికా తత్త్వబోధిని.

శ్రీమాతరంద్విజేంద్రా హరిహరవిధివందితామాద్యాం।
సర్గస్థితిలయకర్త్రీమేకాం తాం సర్వగాం నౌమి॥
గురుపదకమలం స్మరామినిత్యం దృఢతమసంశయవారిరాశిపోతం।
మతికువలయకోశశీతభానుం తమసి నిమగ్నపదార్థజాలభానుం॥
జయతి జ్యోతిర్విద్యా నిగూఢతత్త్వాఽఖిలైర్వంద్యా।
శ్రుతివేద్యా గురుకృపయా లభ్యరహస్యా జగత్యాద్యా॥
పంచాంగనిర్ణయస్యైవ గుణదోషప్రకాశికా।
ప్రకాశితా మయాపూర్వం తస్యాస్తత్త్వమకల్మషం॥
అజ్ఞాత్వా కశ్చిదాచార్యో జ్యోతిశ్శాస్త్రవిశారదః।
ప్రమాద్యభవదత్యర్థం సారాసారవివేచనే॥
తస్మాదిదానీం విస్పష్టం తత్త్వం తస్యాస్సునిశ్చితం।
ప్రకాశనార్థం విదుషాం క్రియేఽహంతత్త్వబోధినీం॥

## నిర్మాణకర్తృవిచారణము.

ప్రమాదీచాబ్దపంచాంగే శ్రీకృష్ణార్యస్యధీమతః।
నిర్మాణం దృశ్యతే నహ్య కర్తృనామవివర్జితం॥
యత్సంగత్యాచ తత్రత్యవాక్యై రన్యైశ్చ హేతుభిః।
కృష్ణార్యస్యేతి విద్వద్భిస్తద్జ్ఞేయం నేతరస్యతు॥

భారతీయవిద్వాంసులారా! శ్రీప్రమాదిసంవత్సరశాస్త్ర దృక్సిద్ధ పంచాగమున ప్రచురింపబడిన పంచాగనిర్ణయ గుణదోషప్రకాశికాని ర్మాణము, అను గ్రంథమును చదివియుందురుగదా- అందుప్రథమపుట

మొదటి కాలమునం దిరువదెనిమిదవ పంక్తిలో "మేము 12-5 1912 తేదీని తమవద్ద కొక పంచాగముననంపి యందలిగుణదోషములను విమర్శించి దెలుపమని వ్రాసినందున" అనియున్నది. ఈరీతినున్నముద్రితపత్రసహితముగా శ్రీశ్రీశ్రీ రాజాఅంకితం వేంకటజగ్గారాయ బహద్దరు జమీన్దారువారు పైతేదీని నాకుపంచాగము నంపిరి. అందువలన శ్రీశ్రీశ్రీ రాజా=జమీన్దారువారు నిర్వాణము వ్రాసిరని తోచుచున్నది. కాని శ్రీప్రమాదిసంవత్సరశాస్త్ర దృక్సిద్ధపంచాంగ ముఖపత్రమునందున్న "విద్వత్తాండవకృష్ణార్య= కృతః పంచాగనిర్ణయః" అనుశ్లోకమువలన ప్రమాదిసంవత్సరపంచాంగను విద్వత్తాండవనేక నామాంకితకృష్ణార్యకృతమనియేగదా నిశ్చయము. ఆపంచాంగమునం దారవపేజీయం దేడవకాలములో "ఏంసంఘసక్రమము పంచాంగనిర్ణయగుణదోష ప్రకాశికా నిర్వాణమను గ్రంథములో వ్రాసియున్నాము" అనియున్నది. ఈవాక్యమునందలియుత్తమపురుష ధాతువు- నిర్వాణము కృష్ణాచార్యులవారిదేయని నిశ్చయముగ బోధించుచున్నది. ఇదియునుంగాక నిర్వాణము కర్తృనామశూన్యమగుటం జేసి సంగతి చేగూడ నల్లే స్థిరపడుచున్నది. మరియు- కరిక్రాన్తి సంక్రాన్తివిషయకశిష్యసింహవిజృంభణమునందు "శ్రీమాన్=దైవజ్ఞచక్రవర్తిగారి నిర్వాణములోను" అనువాక్యముగూడ నల్లే స్పష్టపరుచుచున్నది. ఇంతియెగాక- శ్రీరాజాగారు చీమలపాటివారికి ఇచ్చినజబాబులోతొమ్మిదవ ఫిరాలో "తోపల్లివారిపత్రికకు మేము వ్రాయించిన జబాబులు" అనువాక్యమునందలి ప్రేరణార్థకమగు వ్రాయించిన అను శబ్దమువలన శ్రీశ్రీశ్రీ రాజావారి యాజ్ఞానుసారముగ ఆచార్యులవారు నిర్వాణపత్రలేఖనోద్యుక్తులైరని స్పష్టమగుచున్నది. కాన శాస్త్రదృక్సిద్ధనామముగలపంచాగమునందలి నిర్వాణము కృష్ణాచార్యులవారిదేయని నిశ్చయముగ దెలియదగినది. కాని వేరుకాదు.

పంచాగనిర్ణయస్యైవ గుణదోషప్రకాశికా।
ప్రకాశితా మయా ప్రాగ్వా సూర్యసిద్ధాంతసంమతా॥

యథార్థవాదినీ సా తాం పశ్యన్నేవ సుధీవరః।
శ్రీకృష్ణశర్మోద్భవ త్సమ్యఙ్నిర్వాణే కృతనిశ్చయః॥

శ్రీరాజా అంకితం వేంకటజగ్గారాయ బహద్దరు జమీందారువారి యాజ్ఞానుసారముగనే పంచాంగనిర్ణయమందలి గుణదోషములను వ్యక్త పరచుటకై గతాబ్దమున నాచే ప్రచురింపబడిన గుణదోషప్రకాశిక యను గ్రంథము సౌరాద్యార్షసిద్ధాంతానుసారముగ యథార్థకథనము చేసినది గాని పరదూషణాసక్తి గలదికాదు. అందలిపదార్థములను చక్కఁగ దెలిసికొనకయే విద్వ దిత్యాద్యనేకనామములు గల కృష్ణాచార్యులవా రందరి "శ్రుతిరిపు" ఇత్యాదిపదములను నిందలనుగాను "సమ్యక్ఫాలాక్షవిత్తమః" ఇత్యాదిస్తుతిపరపదములను గూడ నిందలనుగాను భావించి నిర్వాణోద్యుక్తులైరి.

ఇక ప్రకృతాంశము వివరించెద:

శ్రీమాతా సర్వలోకైకజననీ భుక్తిముక్తిదా।
వాజ్మేశార్చితా సమ్యక్సర్గస్థిత్యంతకారిణీ॥
శ్రుత్యగ్రవేద్యా కల్యాణీ జ్యోతీరూపా యతస్తతః।
శ్రీమాతుః ప్రణతి స్సమ్యక్కృతా నూనం మయా పురా॥
"సర్వే శాక్తా ద్విజాః ప్రోక్తా న శైవా న చ వైష్ణవాః।
ఆదిశక్తిముపాసంతే గాయత్రీం వేదమాతరం॥"
ఇత్థం దృష్టం యత స్తస్మా చ్ఛాక్తా స్సర్వే ద్విజాతయః।
అన్యే ద్విజాతితో భిన్నా యే న శాక్తా స్త ఏవ హి॥

ద్విజశ్రేష్ఠులారా! విశ్వతకృష్ణాచార్యులవారు స్వీయనిర్వాణారంభకాలమునం దేడవపంక్తిలో "శాక్తమతాభిమానమునను యథార్థపక్షపాతి పాశ్చాత్యప్రభువరద్వేషాతిశయముచేతనను మాతృవందనమునుం దాచరించి" అనివ్యక్తపరచిరి-వీరికిగల సంశయద్వయవిచ్ఛేదము చేయుట యావశ్యకమయ్యున్నది. యథార్థపక్షపాతి పాశ్చాత్య ప్రభువర

ద్వేషాతిశయము నాకెన్నడును లేదు. భారతీయద్విజులకు శ్రీమాతృధ్యానము ప్రధానమని శ్రుతిస్మృతిపురాణములు ఘోషించుచున్నందున ద్విజాగ్ర్యుడనగు నాచే శ్రీమాతృవందనము ముందుగ జేయబడినది. "మాతృదేవోభవ" అని శ్రుతివాక్యము-"నమాతుః పరదైవతం" అని స్మృతివచనము "యత్రాస్తి భోగో నతు తత్ర మోక్షో యత్రాస్తి మోక్షో నతు తత్ర భోగః। శ్రీసుందరీసాధకపుంగవానాం భోగశ్చ మోక్షశ్చ కరస్థఏవ" అని పురాణవచనము కలదు. ఇత్యాదికము సర్వవిద్వద్విదితమే.

శ్రీశబ్దస్య చతుర్థ్యేకవచనంతు శ్రియై శ్రియే।

ఇతి వ్యాకరణాత్సాధు శ్రీమైత్త్వం నసాధుహి॥

నిష్పాక్షికభారతీయకోవిదులారా! విద్వదిత్యాద్యనేకనామములుగల ఆచార్యులవారు "శాక్తమతాభిమానమునసూ" యనిసాభిప్రాయవచనాదరులగుచు తమనిర్వాణారంభమున "శ్రీమైనమః" అని శ్రీదేవీనమస్కారరూపమంగళాచరణము చేసిరి. శ్రీః. అనుదేవత శక్తిభిన్నముగునా ఊహింపుడు- శ్రీశబ్దమునకు చతుర్థ్యేకవచనము- శ్రియై- శ్రియే- అని శబ్దశాస్త్రసిద్ధమేగాక ఆబాలవిద్వద్విదితము- ఇట్లుండ నిర్వాణారంభమున "శ్రీమై-" అని ప్రయోగించిరి. ఇట్లు ప్రయోగించుటకు కారణమెద్దియోయుండునని యూహింపవలసియున్నది. ఏమన- వీరు సర్వతంత్రస్వతంత్రులు. అట్టివారసాధుశబ్దమును ప్రయోగింతురాయని సంశయము కలుగుచున్నది. ఇయ్యది ముద్రణసమయసంజాత ప్రమాదికమని కూడ యూహించవలసియున్నది. కాని స్వయప్రమాదిసంవత్సర శాస్త్రదృక్సిద్ధపంచాంగమునం దెనుబదియైదవపుటయందు చరమకాలమున "శ్రీమై" అనుపదము అశుద్ధమని కనబరచకుండుట ప్రమాదముకాదనియు స్థిరమగుచున్నది. సామాన్యదృష్టిచే నిది యసాధువనకతప్పదు. వీరు సర్వతంత్రస్వతంత్రులగుటచే మరియొకరీతిచే సాధుత్వము సాధించదరేమో యూహింపవలయును.

శ్రీమాతు స్సాత్త్వికీ శక్తిర్యా రమా సా హరే ర్వధూః।
తద్యోగవశతో విష్ణు స్త్రిజగత్పాలకోఽభవత్॥
కియత్కాలే గతే తస్యా శ్శాపాదేవాభవద్ధరిః।
విశిరస్కో మహామాయాప్రసాదేన తతోఽభవత్॥
హయగ్రీవాభిధస్సోపి శ్రీమాతృధ్యానతత్పరః।
ఇత్థం దృష్టం పురాణేషు శ్రుతిమూలేష్వలం యతః॥
హయగ్రీవ స్తత శ్శాక్త స్సర్వవిద్యావిచక్షణః।
సర్వజ్ఞః కుంభజస్యార్య స్త్రికాలజ్ఞో జితేంద్రియః॥
యత స్స్వకీయనిర్వాణముఖే తస్మై శ్రియై ముదా।
శ్రీకృష్ణార్యో నతిం చక్రే శ్లాఘ్యం నిర్వాణమేవ తత్॥

కోవిదులారా! నిర్వాణారంభమునందు "హయగ్రీవాయనమః" అనిద్వితీయమంగళము. శ్రీహయగ్రీవమూర్తివారు పరదేవతాసాక్షాత్కారముగలవారు. అని బ్రహ్మాండపురాణాదులయందున్నది. విద్యాభుక్తిముక్తిప్రదంబగు హయగ్రీవప్రణతిపూర్వకముగు ఆచార్యులవారి నిర్వాణము శ్లాఘ్యతమము కాకుండునా.

దిగ్వస్త్రత్వయష్టిరీకరణ ప్రశంసా.

శ్రీకృష్ణార్యస్య నిర్వాణే దిగ్వస్త్రత్వయసమర్థనం।
తద్దృష్టం శాస్త్రయుక్తిభ్యా ముతో దిగ్వస్త్రత్వయష్టినః॥
"సచ్చితే కోమలాభాసద్ద్విధ్వజాఙ్కైః పురంకిల।
బాలతత్త్వాభిధం చాత్రి శుష్కక్తం తద్ధతం కిల॥
మేధస్వయష్టా నసక్తశేషాస్త్రం చ యత్త్రతః।
సద్దేశాపత్తిమాలాంశాస్వప్నభూమశితేశా స్వస్వధా॥"
ఇతి యుక్తిశతం తేన దిగ్వస్త్రత్వయసమర్థనే।
తతేవ దిగ్రహ్మా జాత ప్రస్తేషు తి నఠం ఘ్ముటం॥

భూగోళశాస్త్రజ్ఞులారా! పంచాంగనిర్ణయమందలి గుణదోషములను ప్రచురించుటకై బయలుదేరినగుణదోషప్రకాశిక యథార్థకథనశీలయని స్పష్టపరచుట ప్రసంగసంగతిచే నావశ్యకమగుటవలన కొంచెము వ్రాయవలసివచ్చినది "ఈయంశాదికము మిక్కిలి శోధించియివ్వబడినవి. ఇవి శిష్టదైవజ్ఞసంమతములేకాక లండీయచిత్రపటసిద్ధములై యున్నవి. వీరితూలాంశలకంటె సిద్ధాంతదర్పణోక్తరేఖాంతరాంశాదికము కలాది ౬।౩౦ అధికముగ నున్నది. కల్పవల్ల్యుక్తరేఖాంతరాంశాదికముకంటె ఇందలితూలాంశలు కలాది ౪।౩౦ అధికముగనున్నది. ఇదిస్వల్పాంతరమని చెప్పనొప్పు" అనిగుణదోషప్రకాశిక పంచాంగనిర్ణయమందలితూలాంశలు యథార్థములని గుణశ్లాఘనమే చేసినది. పంచాంగనిర్ణయమందలి తూలమంశాత్మకమగుటవలన- సిద్ధాంతదర్పణోక్తదేశాంతరము పలాత్మకమగుటవలన పలలను భాగాత్మకముగ సాధించి న్యూనాధికప్రదర్శనము చేయబడినదిగాని యంశాధికము కనపరచుటకుకాదు. ఈస్థలమునందాచార్యులవారి నిర్యాణాద్యపుట చరమకాలమునందిరువదెనిమిదవపంక్తియందు "దోషముపెద్దదిగ గన్పట్టుటకు ౬।౩౦ కలలు ఎక్కువయని వ్రాసిరి. 390 వికలలుయెక్కువయంటే ఇంకాబాగుండునుగదా." అని కానవచ్చుచున్నది. బుధులారా- దోషప్రకాశమును చేయునెడ "సమ్యక్తూలాక్షవిత్తమః" అనియు "ఈయంశాదికము మిక్కిలి శోధించియివ్వబడినవి. ఇవి శిష్టదైవజ్ఞ పరిగృహీతములేకాక లండీయచిత్రపటసిద్ధములై యున్నవి" అనుగుణదోషప్రకాశికయందలి వచనములు స్వోక్తివిరుద్ధములుకాకుండునా- న్యాయబుద్ధిచే నాలోచింపుడు- ఇచట ఆచార్యులవారు పూర్వాపరవాక్యసమన్వయము చేయక సంగతిగనజాలకయేగదా గుణశ్లాఘనముచేయు గుణదోషప్రకాశికావచనముల కులికిపడి దోషభ్రాంతికలవారైరని నొక్కివక్కాణింప దగినదియేగదా.

తత్త్వజ్ఞులారా! "మేము ఈఅవ్యవస్థలకు బాధపడలేక స్వచ్ఛమైన అసకృద్వేధలచే స్థిరీకృతములగు దేశాంతరాంశలను పరిగ్రహించితిమి

వీటిని మనచక్రవర్తులుకూడ గ్రహించియున్నారు" అని ఆచార్యులవారి నిర్వాణాద్యపుట చరమకాలావసానమం దున్నదిగదా "గ్రహించియున్నారు" ఇచట భూతకాలిక క్రియవలన వీరికంటే పూర్వమునందే ఈ దేశాంతరాంశలు స్వ[illegible]మైన అసకృద్వేధలచే స్థిరపరచి మనచక్రవర్తులు గ్రహించిరని నిశ్చయమగుచున్నది. కనుకనే శిష్టదైవజ్ఞ పరిగృహీతములేకాక లండియచిత్రపటసిద్ధములైయున్నవియని గుణదోషపత్రికాశిక ప్రచురించినది. పాశ్చాత్యదైవజ్ఞులవలె వీరుకూడ సూక్ష్మయంత్రములచే వేధచేసి స్థిరపరచిరని కొందరికి తోచవచ్చును కాని వీరు వేధచేసి స్థిరపరచలేదనియే సంగతినిపట్టి స్థిరపడుచున్నది. ఎట్లన "దృక్పక్షమందు డెస్టాంఫ్స్ అనుపరించి గ్రంథమునుంచి అన్నిసిద్ధగ్రహములు గ్రహించబడినవి. ఆ గ్రహసాధనమునకు తగినగ్రంథము మా రాజాగారు తెప్పించినారు. కొంచెము విలంబముగా వచ్చినది. చంద్రసాధనగ్రంథము ఇంకా రాలేదు. ఈ గ్రంథములమీద గ్రహసాధనము చేయుటకు సుమారు మంచిగణితజ్ఞులు ౨౦ మందికంటే యెక్కువగణకులు చేరినగాని కాజాలదు. ఇంతమందిని పోషించు మహోదారులగు ప్రభులను మన దేశమందావిర్భవింప జేయవలయునని శ్రీహరిని ప్రార్థించవలశియున్నది." అని ఆచార్యులవారి ప్రమాదిసంవత్సరపంచాంగమునం దేడవపుటాద్యకాలమునం దారవపంక్తి మొదలుగా గన్పట్టుచున్నది. ఇందువలన పంచాంగనిర్ణయమందలి దైనందినదృక్సిద్ధగ్రహగణితము గ్రంథప్రాప్తి విలంబమగుటవల్లను- చంద్రసాధనగ్రంథము లభించకపోవుటవల్లను- ఇక్కాలంబున నిరువదిమందికంటే అధికసంఖ్యగల గణకులను పోషించగలిగిన ప్రభువుల యావిర్భావమే లేనందువల్లను అంతకంటే తక్కువగణకులవలన పని కాకపోవుటవల్లను ఫ్రెంచీగ్రంథములోనుంచి అన్నిసిద్ధగ్రహములను గ్రహించిరి. ఇందువలన దృక్సిద్ధగ్రహానయనమునకు తగిన పరికరములు వీరి కింతవరకు లభించలేదు. గ్రంథాదిపరికరములు లేని యాచార్యులవారు వేధచేసి దేశాంతరాంశలను స్థిరపరచలేరనియు పా

శ్చాత్యులచే స్థిరపరచబడిన దేశాంతరాంశలను పరిగ్రహించిరనియును స్పష్టపడినది. ఇంతియేకాక "మాదేశాంతరాంశలట్లుకావు- శుద్ధమైన వేధకుశలుల గ్రంథములోనుంచి వ్రాసితిమి. అనిగ్రహించవలెను. ఇప్పుడు వేధ చేసిన నింతే వచ్చుటకు సందియము లేదు" అని ఆచార్యులవారి నిర్వాణచతుర్దశ పుటకా॥౨॥పంచమ పంక్త్యాదికమునందు స్పష్టముగ వీరు వేధ చేయలేదనియు ఇతరుల వేధవలన స్థిరపరచిన దేశాంతరాంశలను గ్రహించిరనియేకదా స్పష్టముగనున్నది. ఈదేశాంతరాంశాదికమునుగూర్చి సిద్ధాంతదర్పణాది భారతీయగ్రంథములను- బ్లాక్స్- జనరల్- అట్లాస్- అనుపాశ్చాత్య గ్రంథమును శోధించియె శిష్టదైవజ్ఞపరిగృహీతమై లండీయ నిత్యపటసిద్ధమై యున్నదియని గుణదోషప్రకాశిక వచించెను. ఇట్లుండ "ఇది నిజమని తాము చెప్పిరా=లేక చెప్పగలరా=" అని నిర్వాణాద్యపుటచరమకాలావసానమందలి వచనములు సందర్భశూన్యము లేగదా. ఇదినిజమని తాము చెప్పిగదా ఇతరులు చెప్పగలరాయని అనవలెను. ఆలోచింపుడు "మేము ఈఅవ్యవస్థలకు బాధపడలేక అసకృద్వేధచే స్థిరీకృతములగు దేశాంతరాంశలను పరిగ్రహించితిమి" అనుఆచార్యులవారి నిర్వాణవాక్యమును చూచితిరా "అతిపరిశుద్ధవేధసిద్ధమగుడెస్ టెంప్స్- అనుగ్రంథపు ౧౭- ౬౧ పేజీలలో వ్రాసినప్రకారము ౮౩-౧౭" అనిఆచార్యులవారి నిర్వాణచతుర్దశ పుటాద్యకాలిత్రైకాదశ పంక్తిలో గానవచ్చుచున్నది. ఇందువలన దేశాంతరాంశలు పైగ్రంథాను సారముగ వీరిచే గ్రహింపబడినవనిగదా స్పష్టపడినది. గ్రంథబాహుళ్యమున్నచో ఈషద్వైషమ్యములు ప్రాయశః కలుగును. ఒకటే ఉన్నయెడల అవ్యవస్థాదికమెట్లు కలుగును. మనభరతఖండమునందు వలెనే యూరపుఖండమందుగూడ సుకృతివరులై అనేకులగు విద్వాంసులు లోకోపకారమునకును శాశ్వతప్రతిష్ఠకొరకును మిక్కిలిశ్రమపడి గ్రంథములను వ్రాసియున్నారు. తత్కాలికపరికరాదులనుబట్టి ఈషద్వైషమ్యము లాయాగ్రంథములయందు గలవు. ఎట్లన:

| | | |
|---|---|---|
| డెన్. టెంప్స్. అనుగ్రంథప్రకారము విశాఖపట్టణ రేఖాంతరాంశలు. | } | ౮౩°-౧౭′ |
| బ్లాక్స్. జనరల్. అట్లాస్. ప్రకారము విశాఖపట్టణ రేఖాంతరాంశలు. | } | ౮౩-౩౧ |
| ఈ రెంటికిగలయంతరము. | | ౦-౧౪ |

ఇపుడుమాత్రము వీరికి అవ్యవస్థబాధ కలుగలేదా- ఈరెంటిలో నేదిపరిశుద్ధమో ఏది యపరిశుద్ధమో వీరుచెప్పగలరా- చెప్పిరా- ఇచట మహాజనపరిగ్రహమేగదా గ్రాహ్యము- ఈప్రకారమే సిద్ధాంతదర్పణ తిథికల్పవల్లులయందు గలదేశాంతరాంశ భేదముగాని వేరుకాదు. తాముపరిగ్రహించిన డెన్. టెంప్స్. అనుగ్రంథమునందలి దేశాంతరాంశలు అతిపరిశుద్ధ వేధసిద్ధములనిరిగాని నిజముతెలిసికాదు. ఏమన "వేధచేసిననింతేవచ్చును" అనిగదా యాచార్యులవారి నిర్వాణవచనము- చేసిన- అనుశబ్దమువలన చేయలేదనియేగదా స్పష్టమగుచున్నది. తాము వేధచేయనిదీ నిజమెట్లుతెలిసెను. గ్రంథమేకదా మాకును- వీరికిని ప్రమాణము- బ్లాక్స్. జనరల్. అనుగ్రంథము శోధచేయకనే వ్రాసిరనిచెప్పగలరా- అట్లుచెప్పిన అచటివిద్వాంసులు వీరికి తగిన సన్మానము చేయకుందురా- సంగతి నాలోచింపకనే "పాపము- వీరికేదోకల్పవల్లి-కామధేను- ఇత్యాదినామమాత్రప్రతారితులై ఏదో యొకపిచ్చిగ్రంథమునందుచూచి వీరిట్లువ్రాసిరి." అని ఆచార్యులవారి నిర్వాణచతుర్దశపుట ద్వితీయ కాలిక తృతీయ పంక్త్యాదులయందు గన్పట్టుచున్నదిగదా. డెన్. టెంప్స్. అనుగ్రంథమునందలి దేశాంతరాంశాదికమును మాత్రము చూచి- బ్లాక్స్. జనరల్ అనుయూరపు ఖండమునందలి గ్రంథమునుచూడక కల్పవల్ల్యాదులు పిచ్చిగ్రంథములని వచించుచున్న యాచార్యులవారికి సర్వతంత్రాదినామములిడిన మహావిద్వాంసులిపుడు తగినయపూర్వసత్కారము చేయుదురని తలంచెద "3 పే 20 పం॥ లందీయ చిత్రపటసిద్ధములని గ్రామ్యశబ్దపురస్సరముగ ఉపహాసముగ వ్రాసినసిద్ధాంతిగా

రిపాండిత్యము గొనియాడదగియున్నది'' అని ఆచార్యులవారి నిర్వాణద్వితీయపుటాద్య కాలిక తృతీయపంక్తిమొదలుకొని కానవచ్చుచున్నది. ఇచట లండీయ-చిత్ర-పట-సిద్ధ- అనుశబ్దములలో నిది గ్రామ్యశబ్దమనివ్యక్తపరచిరా- ఎన్నడైనవ్యక్తపరచగలరా- ఏమిఆచార్యులవారి సాహసము-కోవిదులారా! ఈశబ్దచతుష్టయములో- లండీయ-అనుశబ్దము- వాచస్పత్యమునందును- చిత్ర-పట- సిద్ధ-శబ్దములు- నామలింగాను శాసనాది సకలకోశములయందును- కావ్యనాటకాలంకారాది సకలగ్రంథముల యందును స్పష్టముగ గన్పట్టుచున్నవికదా- ఇట్లుండ ఆచార్యులవారు వాచస్పత్యాది కోశముల నెన్నడును చూచియుండకపోవుటవలన విపరీతజ్ఞానము గలవారై ఉపహాసమనుకొనిరి. ఇపు డెవరిపాండిత్యము కొనియాడదగినదో విద్వత్ప్రభువు లూహించెదరుగాక- రేఖాంతరాంశాదికమునుగూర్చి ప్రసంగసంగతిచే నింతవరకు వ్రాయవలసివచ్చినది. ఇట్లుండనిండు- దైవజ్ఞ చక్రవర్తిగారికి దిక్కు-తప్పలేదు- అనిసాధించుటకు ''తత్త్వవివేకము మధ్యాధికారము ౧౬౨ శ్లో॥ పశ్చిమేరోమకాఖ్యాచ్చ ద్విద్విభాగైః పురంకిల। ఖాలదత్తాభిధం చాస్తి వ్యక్షస్థం తద్గతంకిల। మేరుద్వయస్థానసక్తరేఖావృత్తంచ యత్తతః। స్వదేశావధి తులాంశా స్స్పష్టభూపరిధౌ స్వకాః॥'' అనివ్రాసితరువాత ''ఉజ్జయిన్యాం ౧౧౨'' తూలాంశలు అనియున్నది. ఖాలదత్తమువలె విశాఖపట్టణము ప్రధానస్థానము- దీనికి పశ్చిమమం దుజ్జయిని యున్నందున పశ్చిమతూలాంశలనివ్రాయుట తప్పుకాదు- స్వస్థానప్రధానములు తూలాంశలు- అన్యస్థానప్రధానములు దేశాంతరాంశలు- ఈశబ్దార్థముల నెరుగకకదా దైవజ్ఞచక్రవర్తిగారికి దిక్కు-తప్పెననుట. ఇపుడెవరికి దిక్కు-తప్పినదో పరిశీలింపుడు-'' అని నిర్వాణద్వితీయపుటాద్యకాలమునం దిరువది రెండవ పంక్తిలగాయతు కానవచ్చుచున్నది. ఈవాక్యము నిర్వాణకాములగు నాచార్యులవారిది కాదని ''దైవజ్ఞచక్రవర్తిగారికి'' అనుపదమువలన వ్యక్తమగుచున్నది. ఎవరికైనను దిగ్వ్యత్యయాభావ సమర్థనము శాస్త్రీ

యముగనున్నదా లేదాయను అంశముమాత్రమే ప్రకృతముగనుక దానిని స్పష్టపరచదగియున్నది. ఆచార్యులవారికి దిక్కుతప్పలేదని సమర్థించుటకు తత్త్వవివేకమధ్యాధికారాంతర్గతమగు "శ్లో॥ పశ్చిమే రోమకాఖ్యాచ్చ ద్విద్విభాగైః పురంకిల। ఖాలదత్తాభిధం చాస్తి వ్యక్షస్థం తద్గతంకిల ॥ ౧౨౨ ॥ మేరుద్వయస్థానసక్తరేఖావృత్తంచయత్తతః। స్వదేశావధి తూలాంశా స్స్పష్టభూపరిధౌ స్వకాః॥ ౧౨౩॥" అనుశ్లోకద్వయము నిర్వాణమునందుదహరింపబడినది. దైవజ్ఞులారా! ఈశ్లోకద్వయమున కర్థము దైవజ్ఞబాలురకు తెలియుటకై కొంచెము వ్రాయుచుంటిని- ఈశ్లోకములయందు కొన్నిపదముల కర్థము తెలిసికొనుటకై సిద్ధాంతములయందలి కొన్నిశ్లోకములను చక్కగ ముందు తెలిసికొనవలసియున్నది కాన వానినుదహరించెద॥ "శ్లో॥ భూవృత్తపాదేపూర్వస్యాం యమకోటీతి విశ్రుతా। భద్రాశ్వవర్షే నగరీ స్వర్ణప్రాకారతోరణా॥ యామ్యాయాంభారతేవర్షే లంకా తద్వన్మహాపురీ। పశ్చిమే కేతుమాలాఖ్యే రోమకాఖ్యాప్రకీర్తితా। ఉదక్సిద్ధపురీనామ కురువర్షే ప్రకీర్తితా॥" అను సూర్యసిద్ధాంతవచనములవలన భారతవర్షమునందు ప్రసిద్ధమగులంకాపట్టణమునకు పశ్చిమదిక్కుయందు కేతుమాలావర్షమున రోమకపట్టణముకలదు. భూవృత్తపాదేయనుటవలన లంకాసూర్యోదయానంతరమందుపదునైదుగడియలకు రోమకపట్టణమున సూర్యోదయమగును-ఇందువలన లంకారోమకపట్టణములకుగల దేశాంతరము పదునైదుగడియలనిస్పష్టముగ దెలిసినదికదా-ఇక పైనుదహరించిన తత్త్వవివేకశ్లోకముల కర్థము వివరించెద- రోమకాఖ్యాత్=లంకాపట్టణమునకంటె పశ్చిమదిక్కుయందు పదునైదుగడియలయంతరములోనున్నరోమకనగరమునకంటె-పశ్చిమే=పశ్చిమదిక్కుయందు- ద్విద్విభాగైః= ఇరువదిరెండుభాగలచే-ఖాలదత్తాభిధం=ఖాలదత్తమను నామముగల పురం=పట్టణము- వ్యక్షస్థంకిల=విషువద్వృత్తమునందు ప్రసిద్ధముగ నున్నది. మేరుద్వయస్థానసక్తరేఖావృత్తం=దక్షిణోత్తరధ్రువనిబద్ధరేఖావృత్తము- యత్=ఏదిగలదో- తత్=

ఆరేఖావృత్తము- తద్గతంకిల = ఆఖాలదత్తమును పొందినదిగదా- తతః= ఆఖాలదత్తరేఖవల్లనుంచి- స్వదేశావధి=గణకుడు తాను గ్రహానయనము చేయుస్థానమువరకు గలయంతరము- తూలాంశాః= తూలాంశలు- అనియర్థము॥ యమకోటి-లంకా- రోమక- సిద్ధపురములవలె ఖాలదత్తము మునికృతశాస్త్రసిద్ధముగానందున ప్రసిద్ధరేఖానగరమునకేదిక్కు-యం దెంతఅంతరములో నున్నదో ముందుగ జెప్పవలయును- ఖాలదత్తము కేతుమాలావర్షాంతర్గతమగుటవలన నావర్షమునందు ప్రసిద్ధమగు మేరుద్వయనిబద్ధరోమకపట్టణరేఖకంటె పశ్చిమదిక్కు-యం దిరువదిరెండు భాగలలో నున్నదని తత్త్వవివేకమువలన దెలిసినది- ఇచట లంకారోమకాంతరము గడియలలోనున్నూ- రోమక ఖాలదత్తాంతరము అంశలలోనున్నూ-తెలిసినది. ఈరెండును ఏకదిక్కు-గలవియేగాని విజాతీయములగుటవలన యోగమున కనర్హములుగదా- ఇపుడు మనకు లంకాఖాలదత్తాంతరము భాగలలో దెలిసికొనవలసియున్నది. కనుక లంకారోమకాంతరమగు పదునైదుగడియలను భాగలలోనికి మార్చవలసి యున్నది "స్థితిరసహతిరంశాః" అనుగ్రహలాఘవ వాక్యముచే గడియకారుభాగలని తెలిసినవిషయమే- కావున లంకారోమకాంతరమగు పదునైదుగడియలను ఆరుచేగుణించినభాగలు ౯౦. ఇవి లంకారోమక దేశాంతరాంశలు పశ్చిమదిగ్భవములు- ఆరోమకమునకంటె పశ్చిమదిక్కు-యం దిరువదిరెండు భాగలపైని ఖాలదత్త మున్నది. ఈరెండును ఏకదిక్కు-గలవి గనుక వీటియోగము ౧౧౨. ఇవియే భారతవర్షమునందు ప్రసిద్ధమగు లంకారేఖనుంచి ఖాలదత్తమువరకుగల పశ్చిమదేశాంతరాంశలని తెలిసినవి. కనుక నే- "ఏవంస్వరేఖానగరేతూలాంశాశ్చసద్వైవహీ। ఆరేఖ-ందవః ౧౧౨" అనితత్త్వవివేకముధ్యాధికారాంతర్గత(౧౨౮)శ్లోకమునందు చెప్పబడెను. ఈగ్రంథకర్త భారతవర్షీయుడగుటవలన స్వరేఖానగరమగు లంకయందలి తూలాంశలు ౧౧౨ అని స్పష్టపరచి యనంతరమందు-సాక్షముగు- "ఉజ్జయిన్యాంతూ ౧౧౨

అ౨౨౧౮" అనికనపరచెను- ఇట్లుండ- "ఖాలదత్తమువలె విశాఖపట్టణము ప్రధానస్థానము" అనిగదా ఆచార్యులవారి నిర్వాణవాక్యము. ఇందువలన మేరుద్వయసక్తరేఖావృత్తము విశాఖపట్టణమును స్పృశించి నదియని స్పష్టమగుచున్నది. యమకోట్యాదులవలె భారతవర్షాంతర్గత విశాఖపట్టణము మునికృత శాస్త్రసిద్ధము కాదు కేతుమాలాంతర్గత ఖాలదత్తమువంటిది. ఈ విశాఖపట్టణము భారతాంతర్గత మగుటవలన భారతవర్షమున ప్రసిద్ధలంకారేఖకే భాగమం దెన్నియంశలపై నున్నదో దానిని ముందుగ వివరించవలసియున్నది. అట్లు వివరించుట వలన స్వాభిమత రేఖాస్థానమగు విశాఖపట్టణమునుంచి భారతవర్షప్రసిద్ధమగు లంకోజ్జయినీ రేఖయందలి తూలాంశలు స్పష్టమగును- "తతఃస్వదేశావధి తూలాంశాః" అనిగదాయున్నది. ఇందువలన స్వాభిమతరేఖాస్థానమునుంచి స్వదేశపర్యంతము గలయంతరముగదా తూలాంశలు- ఇచటజూడుడు- ఖాలదత్తమువలె విశాఖపట్టణము ప్రధానమనుటవలన- ఖాలదత్తరేఖవంటిదియే విశాఖపట్టణరేఖ. విశాఖపట్టణరేఖనుంచి స్వదేశమువరకు గల యంతరముగదా తూలాంశలని వ్రాయవలసియున్నది. వీరి రేఖాస్థానము- విశాఖపట్టణము- గ్రహానయనము గూడ విశాఖపట్టణముననే యగుటవలన స్వదేశముగూడ విశాఖపట్టణమే-ఇందువలన వీరికితూలాంశలు శూన్యమగును.

ఇట్టికల్పనవలన రేఖాస్థాన స్వదేశముల నైక్యము ప్రకృతమున సంభవించినది. కాన విశాఖపట్టణమునకు తూలాంశలు శూన్యమనియే వ్రాయవలసినదిగాని ఉజ్జయినీ విశాఖపట్టణములకుగల యంతరము తూలాంశలని ఉజ్జయినీరేఖ నంగీరించని వీరికి వ్రాయదగదు. యూరపుఖండములోవారు గ్రీన్-విచ్-అనునగర రేఖగదా ప్రధానముగ నంగీకరించిరి. బ్లాన్- జనరల్- మొదలగు గ్రంథములయందు గ్రీన్- విచ్- అనునగరమునకు ల్యాంగ్యు ట్యూడ్- ౦-౦ అనియేగదా యున్నది. డెస్. టెంప్స్. అనుగ్రంథమునందు- ప్యారీస్ వేధస్థానమగుటవలన ప్యారీస్

అనునగరమునకు ల్యాంగ్యుట్యూడ్- ౦-౦-౦ అనియేగదా యున్నది- గ్రీ౯-విచ్- వేధస్థానముగ నంగీకరించుటవలన గ్రీ౯- విచ్- ఆల్నెను కుఁ-యందు గ్రీ౯- విచ్- అను నగరమునకు ల్యాంగ్యుట్యూడ్-౦-౦ అనివ్రాసిరి- భారతవర్షమునందలి గ్రహసాధన కోష్టకమున బొంబా యిరేఖను ప్రధానముగ నంగీకరించి బొంబాయినగరమునకు దేశాంతర ము శూన్యమని కనపరచియున్నది. తిధికల్పవల్లియందు విశాఖపట్టణ రే ఖను ప్రధానముగ నంగీకరించుటవలన విశాఖపట్టణమునకు రేఖాంతర ము౨।౨ యనిగదా కనపరచబడినది. ఇట్లే- సిద్ధాంతదర్పణమునందు॥ శ్లో॥ "భూమధ్యరేఖానుభవప్రసిద్ధా అక్షాంశలిప్తాః కిల జూనదుర్గే। తదు త్తరే మోరపురేఽథ భల్లపురేతతో రామగుడేతతశ్చ॥ ౯౫॥ సౌమ్యేజలా బాదపురే క్రమేణ కృతాంకసూర్యాః (౧౨౯౪) కునగాగ్నిచంద్రాః (౧౩౭౧) నాగేక్షణేంద్రా (౧౪౨౮) ద్వికృతాంగచంద్రా (౧౬౪౨) శ్శైలోచ్ఛ్రయాంగాంబర బాహవశ్చ (౨౦౬౭)౯౬॥ ఆకేంద్ర మేతత్సను సూత్రనిష్ఠభూమా న దేశాంతర సంస్కృతి స్స్యాత్॥" అని యున్నది. ఇందువలన జూనదుర్గము- మోరపురము-భల్లపురము- రామగుడము-జ లాబాదపురము- ఇందుండు ధ్రువద్వయ నిబద్ధసూత్రము మధ్యరేఖనుగా నంగీకరించుటవలన ఈ రేఖయందు దేశాంతరసంస్కారము లేదని చె ప్పబడినది- ఏమన- సంస్కారసాధన భూతమగు దేశాంతరవలలు లే నందున సంస్కారము శూన్యమైనది. ఇట్లుండ- ఆచార్యులవారి పం చాంగమునందలి తూలాంశలు విశాఖపట్టణ రేఖనుంచే ఇచ్చినయెడల ౭।౩౬ అనివ్రాయుట అత్యంతా సంగతము. రేఖాస్వపురములకు అంత రమున్నగదా ప్రాక్పత్యగ్విభాగవ్యవస్థ చేయవలెను- ప్రకృతమున రేఖా స్వపురముల ఐకైక్యమగుటవలన వీరికిది కేఁ-ది- ఉజ్జయినీరేఖ నంగీకరిం చినయెడల వీరికిదికుఁ- తప్పినదసు గుణదోషప్రకాశికావచనము య థార్థమేగదా "ఖాలదత్తమువలె విశాఖపట్టణము ప్రధానము. దీనికి ప శ్చిమమం దుజ్జయిని యున్నందున పశ్చిమతూలాంశలని వ్రాయుట తప్ప

కాదు'' అనిగదా నిర్వాణవాక్యము. విశాఖపట్టణము ప్రధాననగరమగుటవలన విశాఖపట్టణ రేఖనుంచి పశ్చిమమందుజ్జయిని యున్నందున పశ్చిమ తూర్పాంశలనిగదా యనిరి- సత్యమస్తు-విశాఖపట్టణము ఖాలదత్తమువలె రేఖాస్థానము. ఆరేఖాస్థానమునుంచి పశ్చిమదిక్కు-యందలి ఉజ్జయినీ నగరమువరకుగల యంతరము ఉజ్జయినీ తూర్పాంశలగును గాని- విశాఖపట్టణపశ్చిమతూర్పాంశ లెట్లగును. వీరు పంచాంగము విశాఖపట్టణమునకు గణన జేసిరిగాన విశాఖపట్టణ తూర్పాంశలే యావశ్యకములుగాని ఉజ్జయినీతూర్పాంశలవలన ప్రయోజనము లేదు. విశాఖపట్టణరేఖ ప్రధానముగ నంగీకరించినయెడల రేఖాస్థానమే వీరికి స్వస్థానమగుటవలన తూర్పాంశలు శూన్యమనియే వ్రాయవలెను. అట్లా పంచాంగమునందు వ్రాసియుండలేదు ''పశ్చిమ తూర్పాంశాః ౨।౩×।౩౦'' అనివ్రాయుటవలన ఉజ్జయినీ రేఖనుంచి యీతూర్పాంశ లివ్వబడినవి యని యూహించకతప్పదు. ఉజ్జయినీ రేఖనుంచి స్వదేశమువరకుగల యంతరము తూర్పాంశలుగదా. వీరిస్వస్థానము ఉజ్జయినీ రేఖకంటె ప్రాక్కు-గుటవలన ప్రాక్తూర్పాంశలు గాని పశ్చిమతూర్పాంశలుకావు. రేఖాస్థానమునుంచిగదా ప్రాక్ప్రత్యగ్దిగ్వ్యవహారము గలుగుచున్నది. ఉజ్జయినీ పట్టణమునకు వీరు గ్రహానయనము చేయలేదు గాన విశాఖపట్టణమునకంటె పశ్చిమమందుజ్జయిని యుండుటవలన పశ్చిమ తూర్పాంశలనుటగూడ యుక్తియుక్తముకాదు. ''మనదేశము ప్రధానముగ భావించునపుడు మనదేశమునుపట్టి వచ్చినదిక్కు-తో ఇతరదేశములకుగల దూరాంశలు తూర్పాంశలగును- మనమాధారముగ గ్రహించు గ్రంథోద్దిష్టమగు ప్రధాన స్థలము ప్రధానముగ భావించునపుడు ఆదేశమును పట్టి వచ్చిన దిక్కు-తో దేశాంతరాంశలను శబ్దముతో వ్యవహరింపబడును- ఇట్లు దేశాంతరాక్షాంశల పేర్లుగల ఒక సంఖ్యాకే ఉద్దేశ్యభేదముచే తూర్పాంశ శరాంశలను ( లాంజిట్యూడు- ల్యాటిట్యూడు-) అను నామములను వహించి ద్వైజాత్యము గలిగి యుండును'' అని ఆ

చార్యులవారి స్వీయనిర్వాణ ద్వితీయపుట మధ్య కాలమునం దారవ పంక్త్యాదికమునం దున్నది. ఈవాక్యమునకును "మనదేశమును ప్రధానముగ గ్రహించునపుడు మనదేశమును బట్టివచ్చిన దిక్కుతో ఇతరదేశములకుగల దూరాంశలు తూలాంశలగును మనమాధారముగ గ్రహించు గ్రంథోద్దిష్టమగు ప్రధానస్థలమును ప్రధానముగ భావించునపుడు ఆదేశమునుబట్టి వచ్చినదిక్కుతో దేశాంతరాంశలను శబ్దముతో వ్యవహరింపబడును" అనునీవాక్యమునకును ఆచార్యులవారి నిర్వాణ వాక్యమే ప్రమాణముగాని ఉద్దేశ్యభేదముచే దేశాంతరాంశలకు దిగ్వ్యపరీత్య పూర్వకముగ నామాంతరకల్పన ప్రాచీనభారతీయగ్రంథములయందు చేయబడియుండలేదు- ఇట్టికల్పన ప్రాచీనభారతీయార్ష గ్రంథములయందున్నదని కనపరచుట వీరికావశ్యకము గాని యశాస్త్రీయయుక్తులు భారతీయులకు ప్రమాణములుకావు- ఏమన "జిజ్ఞాసోర్యుక్తిరిష్టాస్తీయది శ్రుత్యను సారిణీ" అనిబ్రహ్మసిద్ధాంత వచనము- "సర్వత్ర శాస్త్రమేవ ప్రమాణం- నతుయుక్తయః" అని వైదికసార్వభౌమవాక్యమును శాస్త్రప్రాధాన్యమునే యంగీకరించుచున్నవిగాన స్వీయాభిప్రాయానుసారముగల వ్యవస్థలు నిరర్థకములనియే భారతీయ విద్వద్వర్యులు తలచెదరు- రేఖాంతరాంశలు- దేశాంతరాంశలు-తూలాంశలు- అనుశబ్దములు రేఖాస్థానమునుంచి స్వదేశావధిగల పూర్వాపరాంతరమునకు పర్యాయములేగాని ఉద్దేశ్య భేదమూలకమగు నామాంతరములుకావు- "మనమాధారముగా గ్రహించు గ్రంథోద్దిష్టమగు ప్రధానస్థలము ప్రధానముగ భావించునపుడు, ఆదేశమునుబట్టి వచ్చినదిక్కుతో దేశాంతరాంశలను శబ్దముతో వ్యవహరింపబడును." అని ఆచార్యులవారి నిర్వాణమునందలి వ్యవస్థను చూచితిరిగదా "దృక్పక్షమునందు డెస్- టెంప్స్- అను ప్రంచీగ్రంథమునుంచి అన్నిసిద్ధగ్రహములు గ్రహింపబడినవి" అనిఆచార్యులవారు శ్రీప్రమాది సంవత్సర శాస్త్రదృక్సిద్ధ పంచాంగమునం దేడవ పుటమధ్యకాలమునందు యథార్థపరచిరి. ఇందువలన సకలదృ

క్సిద్ధ దైనందిన గ్రహములు ప్రంచీదేశమునందలి త్రైవజ్ఞులచే నాదేశము నకు గణితము చేసి సిద్ధపరచిన సాయన దృక్సిద్ధ గ్రహములననుసరించి త మ పంచాగమునందు నిరయనగ్రహములను ప్రకటించిరనిగదా తాత్పర్య ము- ఇపుడు తమకాధారముగ గ్రహించిన డెస్-టెంప్స-అనుగ్రంథోద్దిష్టమగు ప్రధానస్థలము యూరపుఖండమునందు ప్యారీస్-అనుపట్టణము. ఆచార్యులవారిగ్రహానయనస్థానము భారతఖండమునందు విశాఖపట్టణము- ఇయ్యది ప్యారీస్-అనునగరమునకు ప్రాగ్దిక్కు-యందు వారు ప్రమాణముగ నంగీకరించిన డెస్- టెంప్స అనుగ్రంథప్రకారము ౮౦।౫౭।౬।౯ భాగాదికముపైనున్నది- ౧౯౧౩ సంవత్సరము తాలూకు డెస్ టెంప్స అను గ్రంథమునందు ౬౧ పేజీలోనున్నది గాన ప్యారీస్ పట్టణతః విశాఖపట్టణ ప్రాక్తూలాంశాః ౮౦।౫౭।౬।౯ అని వ్రాయదగినది గాని విశాఖపట్టణ పశ్చిమతూలాంశాః ౭।౩౬ అని వ్రాయదగదు-లేక-స్వీయ పంచాంగము నందలి సౌరరవిచంద్రులు సూర్యసిద్ధాంతానీతులు గనుక సూర్యసిద్ధాంతగ్రంథోద్దిష్టమగు ఉజ్జయినీరేఖకంటె విశాఖపట్టణము ప్రాగ్దిక్కు-యందున్నందున ఉజ్జయినీ రేఖాతః ప్రాక్తూలాంశాః అని వ్రాయదగినది-ఇట్లుండ "పశ్చిమతూలాంశాః" అనిగదా గతాబ్దమున స్వీయపంచాంగమునందు వ్రాసిరి-ఇపుడు దానిని సమర్థించుటకేగదా "మనమాధారముగా గ్రహించుగ్రంథోద్దిష్టమగు ప్రధానస్థలముప్రధానముగా భావించునపుడు ఆదేశమునుబట్టి వచ్చిన దిక్కు-తో దేశాంతరాంశలను శబ్దముతో వ్యవహరింపబడును" అనువ్రాగుదాహృత నిర్వాణవాక్యరీతిచే నాలోచింపగా వీరిదృగ్గ్రహములకు డెస్- టెంప్స- అనుగ్రంథమాధారము- సౌరరవిచంద్రులకాధారము సూర్యసిద్ధాంతము- ఈయుభయగ్రంథములయందు నిర్దిష్టమగు ప్యారీస్- ఉజ్జయినీరేఖలకంటె వీరిగ్రహానయనస్థానమగు విశాఖపట్టణము ప్రాగ్దిక్కు-యందున్నదని సాంప్రతకాలికాబాలవిద్వదంగనావిదితము. ఇట్లు తమకాధారమగు నుభయపక్షీయ గ్రంథోద్దిష్టపట్టణ రేఖలకంటె వీరికి గ్రహానయనస్థానమగు విశాఖపట్టణము

ప్రాగ్దిక్కుయందున్నందున "పశ్చిమతూలాంశాః" అని వ్రాయుటవలనగదా "ఇచటవీరికి దిక్కుతప్పినది-" అనిగుణదోషప్రకాశిక ప్రకటించినది. దీనిని చూచి ఆచార్యులవారు దురాగ్రహగ్రహగ్రస్తులై స్వీయనిర్వాణమున వాసనాశూన్యమైన స్వాభిప్రాయానుసారిభావనాతత్పరులైరి. "తేన దేశాంతరాభ్యస్తా గ్రహభుక్తిర్విభాజితా। కలాదితత్ఫలం ప్రాచ్యాం గ్రహేభ్యః పరిశోధయేత్॥ రేఖాప్రతీచీసంస్థానే ప్రక్షిపేత్స్యుః స్వదేశజాః॥" అని సూర్యసిద్ధాంతవచనము॥ ప్రాచ్యాం స్వరేఖాదేశాత్స్వదేశస్య పూర్వదిగ్భాగస్థితత్వే గ్రహేభ్యః కలాదిస్థానే విశోధయే ద్వర్జయేద్ధీనంకుర్యా దిత్యర్థః। రేఖాప్రతీచీసంస్థానే స్వరేఖాదేశాత్పశ్చిమదిగ్భాగస్థితే స్వదేశే గ్రహేభ్యః కలాదిస్థానే ప్రక్షిపేద్యోజయేత్। కుర్యాత్ గణక ఇతి శేషః। తే సిద్ధాగ్రహాః స్వదేశీయాభవంతి॥ అని గూఢార్థప్రకాశికా వ్యాఖ్యానవాక్యము॥ "లంకాసమయామ్యోత్తరరేఖాయాం భాస్కరోదయేమధ్యాః। దేశాంతరోనయుక్తా రేఖాయాః ప్రాగపర దేశేషు=కలాదిలబ్ధమృణం౦। ఉజ్జయినీయామ్యోత్తరరేఖాయాః ప్రాగ్ధనం పశ్చాత్" అని బ్రహ్మగుప్తసిద్ధాంతవచనము॥ "క్రమేణ లంకోజ్జయినీ హిమాలయప్రసిద్ధరేఖావిషయేషు మధ్యమాః। తతశ్చ పూర్వాపరపత్తనేష్వమీభవంతి దేశాంతరసంస్కృతాగ్రహాః" అనిశిష్యధీవృద్ధిదవచనము. ఇట్లనేకార్ష పౌరుషగ్రంథము లైకకంఠ్యముగనే రేఖాస్థానమునుంచి స్వదేశమునకు గల యంతరయోజన ఘటీభాగాద్యన్యతమముచే సాధించిన దేశాంతరకలాదికము రేఖాతఃప్రాక్ప్రత్యగ్విభేదముగ గ్రహములయందు సంస్కరించమని చెప్పినవిగాని స్వదేశతః రేఖాంతర సంస్కారము చెప్పలేదు. "స్వవేధస్థానమైన విశాఖపట్టణరేఖకంటె ఉజ్జయినీరేఖ పశ్చిమముగుటవలన పశ్చిమతూలాంశలని దిగ్వ్యత్యయమునకు సమాధాన మిచ్చెదరేమో అట్లు చెప్పదగదు. ఏమన-గణితాగతగ్రహము లంకాదేశీయుడగుటవలన రేఖాతఃపూర్వాపరజ్ఞాన మావశ్యకమై యున్నది." అనిశాస్త్రానుసారముగనే గుణదోషప్రకాశిక బోధించినది. ఇట్టి శాస్త్రీయమార్గమును

త్యజించి స్వేచ్ఛానుసారముగ బ్రవర్తింగువారికి స్వాభీష్టసిద్ధి కలుగ దు. "పశ్చిమతూలాంశాః" అనునది ప్రమాదమనినచో వీరికి యశోహాని కలుగునా- ఇపుడు "ఇచట వీరికి దిక్కు-తప్పినది" అను గుణదోషప్రకాశికా వచనము యథార్థమనియె బుధు లంగీకరింతురుగదా- ఆచార్యులవారి నిర్వాణమందలి తూలాంశవిచార మశాస్త్రీయభావనాభూయిష్ఠమై కనుపట్టుచున్నది

ఇట్లుండ వీరి గతసంవత్సరపంచాంగముపైని గుణదోషప్రకాశిక యను గ్రంథము వ్రాయబడినది. వీరి గతసంవత్సరపంచాంగమునందు "విశాఖపట్టణ దక్షిణాక్షాంశాః ౧౭। ౪౨। ౯ పశ్చిమతూలాంశాః ౭। ౩౫। ౩౦" అని కానవచ్చుచున్నది. అందుపైని పశ్చిమతూలాంశాః అనుట వలన వీరికిచట దిక్కు- తప్పినదియను గుణదోషప్రకాశికావచనము శాస్త్రీయమని తలంచియే ఆచార్యులవారు "విశాఖపట్టణ పశ్చిమతూలాంశాః" అను తమ ప్రాచీనవ్రాతను తుడుచుకొని శ్రీప్రమాదిసంవత్సర శాస్త్రదృక్సిద్ధపంచాంగమునందు ౧౬। ౧౭ ఇత్యాదిపుటలయందు "ఉజ్జయిన్యాః పశ్చిమతూలాంశాః" అని వ్రాసిరి. "ఉజ్జయిన్యాః పశ్చిమతూలాంశాః" అను నీవాక్యమున కర్థము ముందుగ యోచింపవలసియున్నది. "పశ్చిమే రోమకాఖ్యాచ్చ" అనుతత్త్వవివేకశ్లోకముగదా ఉపమానముగ బరిగ్రహించిరి. ఈశ్లోకమునందున్న "రోమకాఖ్యాత్" అను పదమువలె "ఉజ్జయిన్యాః" అనుపదము పంచమ్యేకవచనముగదా- ఇందువలన ఉజ్జయినికంటె పశ్చిమదిక్కు-యందలి తూలాంశలని యర్థము. ఉజ్జయినీనగరమునకంటె పశ్చిమదిక్కు-యందు వీరి తూలాంశాంతరమందున్న పట్టణము వీరికి నిష్ప్రయోజనము. ఏమన- వీరికి గ్రహణయన స్థానము విశాఖపట్టణము. ఇచటి తూలాంశలు సప్రయోజనములు. ఇయ్యది ఉజ్జయినీరేఖకంటె ప్రాగ్దిక్కు-యందున్నది. కాన స్వవచనవ్యాఘాత మిపుడు వారించుకొనవలసివచ్చినది. ఈదోషమును వారించుటకై "ఉజ్జయిన్యాః" అనునది షష్ఠ్యేకవచన మందురేమో అ

ట్లైన ఉజ్జయినికి తూలాంశలని యర్థముగదా- ఆపక్షమునం దధిక రణార్థము కావలయును గాన సప్తమ్యేకవచన ముండవలెను గాని షష్ఠికి ప్రయోజనము లేదు. ''కాబులె- ఉజ్జయిన్యాం'' అని తత్త్వవివేకమునందు ''పుర్యుజ్జయిన్యాం'' అని సిద్ధాంతదర్పణమునందు ప్రయోగములున్నవి. ఇచట అర్థప్రధానమేగాని శబ్దసౌష్ఠవము ప్రధానప్రయోజనము గా దనియెదరేని విశాఖపట్టణతః అను పదము లేనిదీ అర్థబోధ కానేరదు. విశాఖపట్టణతః అనునది మానసికమనియెదరా కానిండు. ఆచార్యులవారి యభిప్రాయానుసారముగ తూలాంశలనునవి ఉజ్జయినీనగరమున కనిగదా యంగీకరించవలసియున్నది. అట్లైన ఉజ్జయినీ పట్టణపృష్ఠాక్షాంశ లివ్వదగినవి గాని విశాఖపట్టణ పృష్ఠాక్షాంశాః౧౭। ౪౨।౯ అని ఇవ్వదగదు. ఈ యక్షాంశలు విశాఖపట్టణమునందలివిగాని ఉజ్జయినీ నగరమునందలివి కావు. కాన ఉజ్జయిన్యాః పశ్చిమతూలాంశాః అనునవి ఉజ్జయినీరేఖనుంచి విశాఖపట్టణమునందలివనియే స్పష్టపడినది. రేఖాంతరాంశలొక పట్టణము తాలూకున్ను అక్షాంశలు మరియొక పట్టణము తాలూకున్ను ఇవ్వడము అజ్ఞానమూలకమనవలసివచ్చును.

## సారాంశము.

పరీధావిసంవత్సర పంచాంగమునందు విశాఖపట్టణ పశ్చిమతూలాంశాః అని వ్రాయుటవలన దిక్కు తప్పినది. స్వీయ ప్రమాదివత్సర పంచాంగాంతర్గత నిర్వాణమునందలి దిగ్వ్యత్యయ సమర్థన మశాస్త్రీయ ముగుటవలన దిక్కు లేదని సిద్ధాంతితము.

స్వభక్తరక్షణాక్షీణదక్షా సద్యుక్త్నతిద్విషాం।
శిక్షాక్షమాజయత్యాద్యా విద్యాహృద్యా సతీశివా॥

## అయనప్రశంసా.

మయా ప్రకాశితా పూర్వం గుణదోషప్రకాశికా।
తత్ర తాండవకృష్ణార్యో హ్యయనాంశవిచక్షణః॥
ఇత్థం యద్దృశ్యతే తద్ధి శ్లాఘావాగేవ నాన్యథా।

త్రింశత్కృత్యోయుగేభానా మిత్యుక్తా ఆయనాలవాః॥
వైషువాయత్తతః క్రాంతివృత్తీయే స్ఫుటభాస్కరే।
యోగార్హా న స్యురేవేతి విస్తృతం బహుధైవ తత్॥
విలోక్య విద్వత్కృష్ణార్యః బహునామవిరాజితః।
స్వీయ పత్రికాదిపంచాంగే సూర్యసిద్ధాంతసంమతే॥
వైషువాన్ తాననాదృత్య క్రాంతివృత్తసముద్భవాన్।
దృక్సిద్ధానాయనలవాన్ స్వీకృత్యాయనసాధనం॥
అకరో ద్యత్తతోఽనూనం గుణగ్రాహివరోహ్యసౌ।
ఇతిమే సంమత స్సమ్య క్తద్వదేవ విదామపి॥

ఆర్యులారా!

గతాబ్దమున నాచే ప్రచురింపబడిన గుణదోషప్రకాశిక యను గ్రంథమునందు "అసౌ వయనాంశ విచక్షణః" అనునది శ్లాఘావచనమే. ఇంతియెకాక "కాన నీపంచాంగనిర్ణయమునందలి అయనాంశలు- ఆర్ష సంమతములు- శిష్టదైవజ్ఞాంగీకృతములు- చాక్షుషప్రత్యక్షార్హములు అయి యున్నవి" అను నివికూడ శ్లాఘావచనములే. త్రింశత్కృత్యోయుగేభానాం అను సౌరాంతర్గతశ్లోక సిద్ధాయనాంశలను సౌరానీత సూర్యునిలో సంస్కరించి స్వీయ పరీధావివత్సర పంచాంగమునం దయనాదికము సాధించిరి. పూర్వోక్తాయనభాగలు వైషువము లగుటవలన క్రాంతివృత్తీయసూర్యునితో యోగానర్హములని ప్రకటించిన గుణదోష ప్రకాశికావచనములు శ్రుతిసంమతములగుటవలన ఆచార్యులవారు స్వీయ పత్రికాద్యబ్దశాస్త్రదృక్సిద్ధ పంచాంగమునం దయనాదిసాధనమునకై విషువాయన భాగలను విడనాడి క్రాంతివృత్తీయాయనభాగలను పరిగ్రహించిరి. ఇందువలన వీరు గుణగ్రాహీవరులని కూడ దలచెద.

కృష్ణక్ష్యబ్ధినంమితే శాకే త్వయనాంశప్రబోధకః।
త్రింశత్కృత్యో యుగేభానా మిత్యాద్యైః పరికల్పితః॥
సౌరే ప్రాగార్యభట్టాదినివేశా త్కేనచి త్స్వయం।

ఋషిప్రోక్తాయనారంభ స్సత్యం చే దాయనాః కథం॥
ననత్యాస్స్వర్షి కుత్రాపి నార్షోక్తి స్తత్ర దృశ్యతే।
ఇతి కృష్ణార్యనిర్వాణే యద్వచ స్తదసంగతం॥

భారతీయదైవవిద్వరిష్ఠులారా!

శకము (౪౨౧) నందయనారంభమనుటకార్షసంమతి కానరాదను నిర్వాణవచనముచూడగా నిది మిక్కిలివింతగానుండెను. "అయ్యా! ఋషులుచెప్పిన అయనారంభము నిజమైతే అయనాంశానయన మేల నిజముకాదని? ఇచట తమ కవిత్వమెందుకు? ఆర్యభటుడు నేనువేధచేసి దృక్సిద్ధముచేసినానని చెప్పిన ఆర్యభటసిద్ధాంతమునం దయనాంశలు కానరానందున ఆకాలమున కయనాంశలు లేవనుకొని వాని గ్రంథకాలమగు ౪౨౧ శకమే అయనాంశారంభమనుటకంటె వేరే ఆర్షసంమతి కానరాదు. సూర్యసిద్ధాంతవిసంవాదిశ్లోకములుకూడ దీనినిబట్టియే కల్పించబడినవని తోచుచున్నది" అని ఆచార్యులవారి నిర్వాణ తృతీయపుటాద్యకాలమున పదునైనిమిదవపంక్తిమొదలుకొని కానవచ్చుచున్నది. శకము (౪౨౧) ఆర్యభటగ్రంథకాలమగుటవలన నందయనాంశలు లేనందువలన నార్యభటుడు వేధచేసి దృక్సిద్ధముచేసినానని చెప్పుటవలన ౪౨౧ శకమునం దయనారంభ మనుకొనిరిగాని వేరే ఆర్షసంమతి కానరాదు. సూర్యసిద్ధాంతీయ "త్రింశత్కృత్యః" అనుశ్లోకములుకూడ దీనినిబట్టి కల్పించబడినవనిరిగదా- ఆచార్యులవారు స్వీయపరిధావిపంచాంగమునందు "త్రింశత్కృత్యః" ఇత్యాది శ్లోకద్వయము కల్పించబడినదిగాని ఆర్షోక్తముకాదని వ్రాయలేదు సరేగదా- త్రింశత్కృత్యః అను శ్లోకసిద్ధములగు నయనాంశలు వైషువతములేమో యని సంశయము గలదనికూడ వ్రాసిరి. అందుపైనిగదా అవి వైషువములని గుణదోషప్రకాశిక వ్యక్తపరచినది. దానిని విశ్వసించేగదా దృక్సిద్ధాయనాంశలను స్వీయప్రమాదిపంచాంగమునం దయనాదికమున గ్రహించిరి. ఇపుడాశ్లోకములు కల్పింపబడినవా- "యుగేషట్శతకృత్వోహి భచక్రం ప్రా

గ్విలంబతే'' అని సోమసిద్ధాంతమం[illegible] త్రా- "[illegible]భిర్భాజ్యాస్త ద్గో త్రిఘ్నాదశోద్ధృతాః। అయనాం[illegible] అని [illegible]మందున్నదిగదా- ఇవి ఆర్షసిద్ధాంతములు కావా- ఈరీతి [illegible] (౪౨౧) సందేగదా అయనాంశారంభమగుచున్నది. భాస్కరీయశిరోమణియందు "త్రింశత్కృత్వః" అను పాఠము సౌరమందున్నటుల స్పష్టమగుచున్నది. ఆపాఠాను సారముగగూడ ౪౨౧ శకమునందే గదా అయనారంభము. భాస్కరీయశిరోమణియందు త్రింశత్కృత్వః అనుపాఠానుసారముగనే "తద్భగణాః సౌరోక్తా వ్యస్తా అయుతత్రయం కల్పే" అనియున్నది. కాన భాస్కరాచార్యులవారినాటికి సౌరమందయనాంశలు చెప్పబడియున్నట్లు స్పష్టమేగదా- భాస్కరాచార్యులవారి గ్రంథకాలము ఇప్పటికి ౭౬౩ సంవత్సరములపరిమితికలది. అయనారంభకాలము సోమాద్యార్షసిద్ధాంతములయందు స్పష్టముగనుండగా సౌరమందయనభగణములు చెప్పియున్నటుల భాస్కరసంమతియుండగా నాచార్యులవారు స్వీయనిర్వాణమందు "ఆర్షసంమతికానరాదు. సూర్యసిద్ధాంతవిసంవాది శ్లోకములుగూడ దీనినిబట్టియే కల్పింపబడెను" అను ఆచార్యులవారి నిర్వాణపత్రమందలి వ్రాత గ్రంథపరిశీలకులకు దైవజ్ఞు లంగీకరింతురా-

సంప్రత్యుపలబ్ధాయనగత్యా శ్రుత్యాచ శక్తిభూవచసా।
క్రాంతివృతీయంపరమం గోదృగ్ద్వమాయనంతః సంసిద్ధం॥

భారతీయులారా!

సాంప్రతకాలికోపలబ్ధాయనగతిచేతను శ్రుతిపురాణవచనముల చేతను క్రాంతివృత్తీయపరమాయనభాగ లిరువదితొమ్మిదియనుటకుసందియము లేదు. శ్రు॥ "ముఖంవా ఏతత్సంవత్సరస్య యత్ఫల్గునీ పూర్ణమాసః। ముఖంవా ఏతత్సంవత్సరస్య యచ్చిత్రాపూర్ణమాసః। ముఖంవా ఏతన్నక్షత్రాణాం యత్కృత్తికాః" ఇత్యాదులున్నవి. శ్లో॥ "ప్రథమే కృత్తికాభాగే యదాభాస్వాంస్తదా శశీ। విశాఖానాంచతుర్థంశే మునే తిష్ఠత్య

సంశయః। విశాఖానాం యదా సూర్యశ్చరత్యంశం తృతీయకం। తదా చంద్రం విజానీయాత్కృత్తికాశిరసి స్థితం॥ తదైవ విషువాఖ్యస్తై కాలః పుణ్యోభిధీయతే॥'' ఇవి వరాహవచనములు॥ ఇత్యాదిశ్రుతిపురాణముల వలన సంపాతమునకు పరాగ్గమనము స్పష్టమగుచున్నది. ఇట్లుండుట వలన ఉపలబ్ధిశ్రుతి పురాణానుసారముగ నిరువదితొమ్మిదిభాగలు పరమాయనమని గుణదోషప్రకాశిక ప్రకటించెను. దానినిచూచి యాచార్యులవారు స్వనిర్వాణచతుర్థపుటాదిమధ్యకాలములయందు ''హూణులవిగానవీకుమ్ముట్టరు. ఇది మరీగంభీరముగా నున్నది'' ఇత్యాదివాక్యములచే పరిహసించిరిగాని ప్రమాణమివ్వజాలరైరి. సౌరాద్యార్ష సిద్ధాంతములయందవిశ్వాసముగల ఆచార్యులవారికి పరమాయనాంశ పరిమితి తెలియదని నిశ్చయము.

పాశ్చాత్యపరిగృహీతా నయనాంశాశ్చయనభుక్తిశ్చ।
వేధవిధినోపలబ్ధాం త్యక్త్వైవార్షోక్తరీతిం సిద్ధాన్॥
అయనాంశా నాచార్య స్స్వకృతవాన్ స్వీయపంచాంగే।
యుక్తం హ్యేతచ్ఛాస్త్రం భారతజానాం యతోమానం॥
తథాపి భూయః ప్రాచీనసిద్ధాంతా స్సాంతరా ఇహ।
యతస్తే గ్రహణానన్త్వా ఇత్థమేవ వదన్తి సుధీః॥
సౌరానీతం మధ్యమార్కం గృహీత్వాయనసాధనం।
అకరోదయనం తస్మాత్కృష్టార్యస్యాశోభనం॥

దైవజ్ఞులారా!

పాశ్చాత్యమతానుసారముగ శాలివాహనశకము (౧౮౯౬) నం అయనాంశాభావము యూరపుఖండమునందు సూక్ష్మవేధసిద్ధమగు వార్షికాయనగతి వికలాది ౫౦-౧ ఇట్లు గ్రహసాధన కోష్ఠకమునందు ౩౦౮ పుటయందున్నది. ఈరీతిచే శకము (౧౮౩౮) నందు అయనాంశలు ౧౮। ౨౨।౧౩-౯ ఇవి మిక్కిలి సూక్ష్మములు. ఛాయాతన్త్రకతగా గతాగ్రాం

తర రూపార్షాయనాంశలు ౨౨|౪౩|౨ పై యబ్దారంభమునం దాచార్యులవారిచే పరిగ్రహింపబడినవి. ఆర్షాయనాంశలకంటె పాశ్చాత్యసంమతసూక్ష్మాయనాంశలు ౪|౫|౪౯ తక్కువగానున్నవి. పాశ్చాత్యవేధసిద్ధములు యథార్థములనియేగదా యాచార్యులవారి యభిప్రాయము. అట్లైనను పాశ్చాత్యాయనమును విడచి ఆర్షాయనమును పరిగ్రహించుట మిక్కిలి శ్లాఘ్యతమమైనది. వీరు పాశ్చాత్యాయనమునందు దోషము కనిపెట్టి దానిని త్యజించిరో లేక ఆర్షసిద్ధాంతములయందుగల విశ్వాసాధికముచే పాశ్చాత్యాయనమును త్యజించిరో తెలియదు. ఇంతయంతరము కలుగుటకు కారణ మాచార్యులవా రూహించినయెడల వ్యక్తపరచకుందురా- ఊహించలేదనియే తలచెద. "యోచించగా లక్ష్మణచ్ఛత్రీగారి కోష్టకమువల్ల వచ్చునని తోచుచున్నది. ఇది చిరకాలపుస్తకము. మనపాతసిద్ధాంతములవలె ఇదికూడ నిపుడు భ్రాంతరమగుచున్నది. ఇది పనికిరాదు. దీనినిబట్టి ౧౮౩౪ శకమున కయనాంశలు ౧౯|౩౯|౫౧.౩ వచ్చును. ఇది యెంతవిరుద్ధమో" అని నిర్వాణద్వితీయపుట చరమకాలోపాంత్యపంక్త్యాదిగా నున్నది. గ్రహసాధనకోష్టకమునం దయనాంశసాధనము సమగ్రముగ నొకకంటనైన జూచినయెడల వీరిట్లు వ్రాయరు. ఏమన-సూక్ష్మవేధసిద్ధవార్షికాయనగతి వికలాది౫౦.౧ అనిన్ని ౪౯౬ శకమునం దయనాంశాభావమనియు గ్రహసాధనకోష్టకమునందు ౩౦౮ పుటయందున్నది. అందు ౩౦౭ పుటయందు అయనగతికోష్టక మివ్వబడినది. పాశ్చాత్యాభిమతాయనారంభాయనగత్యనుసారముగ ౧౮౩౪ శకమునం దయనాంశలు ౧౮'౩౭|౧౩.౮ వచ్చినవిగాని ఆచార్యులవారి వ్రాతప్రకారము ౧౯|౩౯|౫౧.౩ రాలేదు. ఆచార్యులవారుచేసినగణితములో అంశాది ౧|౨|౩౭.౫ తప్పున్నట్లుపడినది. ఇచటతప్పుటకు కారణము శ్రద్ధాజాడ్యమేగాని వేరుకాదు. పాశ్చాత్యాభిమతాయనాంశలు సాధించునపుడు పాశ్చాత్యాంగీకృతాయనారంభాయనగతులుగదా గ్రహింపవలెను. ఇచట వీరు ఆర్షోక్తాయనారంభమును గ్రహించి పాశ్చాత్యా

యనగతిననుసరించి అయనాంశసాధనము చేయుటవలన ౧౮౩౪ శకము నందు అయనాంశలు ౧౯।౩౯।౫౧.౬ వచ్చినవి. కాన నివి పాశ్చాత్యసంమతములు కావు. ఆర్షసంమతములును కావు. ఇవి సంకరాయనాంశలని చెప్పదగును. ఛాయార్క-కరణాగతారాౙంతర రూపార్షాయనాంశలు ౧౮౩౪ శకాదియందు ౨౨।౪౩।౨ పాశ్చాత్యసంమతాయనాంశలు ౧౮।౩౭।౧౩.౮ ఈరెంటికిగల యంతరమునకు కారణమును చక్రగదెలిసికొనజాలక ఇదికూడ నిపుడు సాంతరముగనున్నదనిరి కాని నిజము తెలిసికాదు. ఆవిషయము ప్రకృతముగానందున విస్తరించలేదు. ఆ యాౕ- డెస్- టెంప్స్- అను పాశ్చాత్యగ్రంథములోనుంచిగదా అన్నిసిద్ధగ్రహములను గ్రహించిరి. సూక్ష్మవేధసిద్ధమగు పాశ్చాత్యాయన పరిగ్రహ మేల చేయకూడదు. ఆ అయనాంశలయందు దోషమున్నదా- వేధసిద్ధమగునపుడు దోష మున్నదనుట కవకాశముగలుగునా- దోషమున్నయెడల దాసిని ప్రకటించిగదా విడువవలెను. పాశ్చాత్యవేధసిద్ధాయనాంశలు మన ప్రాచీనసిద్ధాంతములవలె సాంతరములనియే త్యజించిరో దానిని పరిగ్రహించినయెడల ప్రకృతమునందు సౌరసంక్రమణాదులయందు నాలుగురోజులచిల్లర మార్పుకావలసివచ్చును గనుక అట్టిమార్పువలన జగద్విరోధముగలుగునను లోకభీతిచే వాటిని పరిత్యజించిరో యను సంశయము కొందరికి కలుగును. కనుక ఈవిషయమై సవిస్తరముగ ఆచార్యులవారు శాస్త్రీయోపపత్తులతో వ్యక్తపరచవలసి యున్నది. "మన పాతసిద్ధాంతములవలె నిదిగూడ నిపుడు సాంతరమగుచున్నది ఇది పనికిరాదు" అను నిర్వాణవాక్యమున కర్థము- మన పాతసిద్ధాంతము లనగా సౌరాద్యార్షసిద్ధాంతములు- ఇవి సాంతరములగుటవలన గ్రహసాధనకోష్టకముతోపాటు పనికిరావుగదా- ఇట్టి దశలో సౌరానీతమధ్యమార్కుడు మాత్రము సాంతరముగాకుండునా? ఇది యాలోచింపక సౌరానీతమధ్యమార్కునికిని ౧౯౧౨ సం॥ గ్రీనిచ్- ఆల్మెనిక్ ౧౨ పేజీలోనున్న ఘంటాదిమధ్య రవికిన్ని గల యంతర మయనాంశలుగ

బరిగ్రహించుటవలన వీరిఅయనము సాంతరము గాకుండునా- పాశ్చాత్య వేధసిద్ధగ్రహములు దృక్సిద్ధము లేగాని తత్సంమతాయనభాగలు దృక్సిద్ధములు కావా- ఇచట వీరి మతప్రకారము సాంతరమగు సౌరాది ప్రాచీన సిద్ధాంతము లయనసాధనమందెట్లు ప్రమాణమగును. పాశ్చాత్యసాయన దృక్సిద్ధగ్రహములను నిరయనులనుగా జేయుటకై సాంతర సౌరాద్యానీతాయన పరిగ్రహము చేసినయెడల ఆదృగ్గ్రహములు సాంతరములుగాకుండునా-ఆలోచింపుడు. ఇదిట్లుండనిండు. ''సౌరానీతమధ్యమార్కునిలో సంస్కరించుటకు దృక్సిద్ధమందఫల మెట్లువచ్చును. వీరికిమాత్రము సాయనరవిమందోచ్చ లేనిదీ దృక్సిద్ధమందఫలమెట్లువచ్చును. ఆరోజున వీరిపుస్తకములో వ్రాసిన ఫలమును గ్రహించెదమందురా ఆఫలము సౌరరవిలో సంస్కరించుటకంటె ఛాయార్కునిలో విలోమముగ సంస్కరించరాదా- ఫలభేద మేమిగలదు. మీకేమిఫలమంటే సాంకర్యము లేకపోవుటయే ప్రథమఫలము. వ్యర్థప్రయాసము లేకపోవుటయే ద్వితీయఫలము.'' అని ఆచార్యులవారి నిర్వాణద్వితీయపుటచరమకాలమున పదకొండవపంక్తియందున్నది. సౌరానీతమధ్యమార్కునిలో సంస్కరించుటకు దృక్సిద్ధ మందఫలమెట్లువచ్చునో- దృక్సిద్ధమందఫలసాధనముకై సాయనరవిమందోచ్చయే కావలెనో నిరయనరవిమందోచ్చయేకావలెనో వీరికి తెలియకపోవుటకు కారణమొకటి కలదు. ఏమన సాంతరదోషాక్రాంతములని ప్రాచీనసిద్ధాంతములను పరిత్యజించి దృక్సిద్ధార్థములగు భారతీయాధునికగ్రంథములు పిచ్చివియని నిరసించిరిగదా- దృక్సిద్ధార్థములగు పాశ్చాత్యసాయనగ్రంథము లిదివరకును సమగ్రముగ వీరికిలభించలేదు. లభించినంతవరకైనా సారణులు భాషాంతరములోనుండుటవలన వాటిని ప్రభువులు మనభాషలోనికి మార్చి చేయించవలెను. అది బహుధనవ్యయమూలకము- బహుకాలసాధ్యము అగుటవలని వీరు గ్రహణయనమునకై నిరాధారులై ఆల్మెనుకులలోనున్న సిద్ధసాయనగ్రహములను గ్రహించి అయనాంశవిహీనము చేసి పం

చాంగసాధనమునూత్రము చేయుచుండిరి. సిద్ధగ్రహములను గ్రహించుటవలన ఫలానయనము చేయు నవసరము ప్రసక్తించలేదు. అందువలన ఫలానయనమునకు కావలసిన పరికరము లెవ్వియో తెలియదు- వీరికి పూర్వమందభ్యాసదశలో ఫలానయన పరికరములు చక్కగ దెలిసినవేగాని- యార్షోపకరణములయందలి విశ్వాసాభావమువల్లను- పాశ్చాత్యోపకరణము లింతవరకు వీరికి లభించకపోవుటవల్లను ఫలానయనపరికరములు విస్మృతులయ్యెనని తలంచెద. "సౌరానీతమధ్యసూర్యునిలో సంస్కరించుటకు దృక్సిద్ధమందఫల మెట్లువచ్చును." అను నిర్వాణవాక్యమునకు ప్రత్యుత్తరమిచట వివరించెద. గ్రహసాధనకోష్టకాది గ్రంథములు దృక్సిద్ధార్హములై యున్నవి. ఆగ్రంథములయందనేక సూక్ష్మవేధలచే సాధింపబడిన పరమమందఫలము చెప్పబడియున్నది. అది పాశ్చాత్యగ్రంథములయందుగూడ నున్న మందఫలతుల్యమేగాని భిన్నము కాదు. పాశ్చాత్యపరిగృహీత మందఫలము పరిశుద్ధమనియేగదా అంగీకరించదగినది. దీటివలన పరమమందఫలము తెలిసినదిగదా- సౌరానీతమధ్యసూర్యుని, మందోచ్చను, సాధించి అందువలనసాధించిన మధ్యమకేంద్రముయొక్క భుజకోటిజ్యలను సాధించి పరమఫలజ్యానురుద్ధముగ భుజకోటిఫలానయనము చేసి అందుకోటిఫలార్ధము త్రిజ్యలో కర్కి మకరాది కేంద్రభేదముచే సంస్కరించిన శుద్ధకోటియగును. ప్రాగానీత భుజఫలశుద్ధకోటి ద్వారకముగా కర్ణమును సంపాదించి భుజఫలమును త్రిజ్యచేగుణించి కర్ణముచేభాగించిన దృక్సిద్ధమందఫలజ్య వచ్చును. దానిచాపము దృక్సిద్ధమందఫలము గాన మందఫలానయనమునకు సాయన రవిమందోచ్చతో ప్రసక్తిలేదు. ఇట్లుసాధించిన మందఫలము మధ్యసూర్యునిలో కేంద్రానుసారముగ సంస్కరించదగినది. కాని విలోమముగ ఛాయార్కునియందు సంస్కరించదగదు. ఛాయార్కుడు సాయనుడగుటవలన సాయనమందోచ్చ ద్వారకముగ స్పష్టకేంద్రమును సాధించి పరమఫలజ్యానురుద్ధము కేంద్రభుజజ్యాద్వారకముగసాధించిన

భుజఫలచాపముగూడ దృక్సిద్ధమందఫలము. ఇయ్యది ఛాయార్కునిలో విలోమముగ సంస్కరించదగినది. కాని మధ్యమార్కునియందు కేంద్రానుసారముగ సంస్కరింపదగదు- ఏమన- ఎవనివలన నేకర్మ చేయబడినదో ఆకర్మఫలమున కాకర్తయే పాత్రుడుగాని యన్యుడుకాడు. “యస్మాత్సాధితం తస్మైవ సంస్కార్యమితి” గూఢార్థప్రకాశికయందున్న వాక్యము వీరికి చక్షుర్గోచరము కాలేనందున ఛాయార్కునిలో విలోమమాగ సంస్కరింపరాదా- సాంకర్యము లేకపోవుటయే ప్రథమఫలము” అని వ్రాసిరిగాని వేరుకాదు. మధ్యమార్కునివలన సాధించిన ఫలము ఛాయార్కునిలో విలోమముగ సంస్కరించుట సాంకర్యము గాదా- వీరికి సాంకర్యాభినివేశన మెందుకు కలుగవలెను. “వ్యర్థప్రయాస లేకపోవుటయే ద్వితీయఫలము” అని వ్రాసిరి. సాధితఫలమును సంస్కరించుటలోగదా ప్రయాసము, ప్రయాసాభావము. కేంద్రానుసారముగ ప్రథమస్ఫూర్తి అయిన ధనర్ణములకు వ్యత్యయస్ఫురణ గలుగజేసుకొనుట వ్యర్థప్రయాసముగాదా “ఛాయార్కాత్కరణాగతే” అను సూర్యసిద్ధాంతవచనమువలన ఛాయార్కుడు సాయనస్పష్టు డగుటవలన కరణాగతార్కుడుకూడ స్పష్టుడే కావలెను. కనుకనే ఫలానయనము చేయవలసివచ్చినది. సాధితమందఫలము మధ్యమరవిలో సంస్కరించిన స్పష్టుడగును. ఇట్టి కరణాగతార్కునికిని ఛాయార్కునికిని గల యంతరమే అయనాంశలగును. ఇది వీరికి తెలియలేదా- మధ్యమార్కాత్సాధిత మందఫలము శాస్త్రోక్తప్రకారము మధ్యరవిలో సంస్కరించడము న్యాయమా, ఫలభేదము లేదని స్పష్టరవిలో విలోమముగ సంస్కరించుట న్యాయమా- నిష్పక్షపాత దైవజ్ఞు లూహించెదరుగాక- పున్నివృత్తిరూపఫలభేదము లేదని యభక్ష్యభక్షణము భారతీయజనుల కుచితమా- ఈయన్యోన్యాశ్రయవారణ చేసికొననక్కర లేకనే ఇష్టదినీయఛాయార్కదృక్సిద్ధార్కాంతర మయనాంశలుగ బరిగ్రహించిన గణితసౌకర్యముకూడ గలుగును” అను గుణదోషప్రకా

శికా వచనముపైని'' ఈపంక్తులకును ౧౨ మొదలగు పంక్తులకును లేఖకులెవరో అవస్థవేరో- ఇదియొక ప్రకారభేదమో వింతగానున్నది'' అని స్వీయనిర్యాణద్వితీయపుట చరమకాలమునందున్నది. అయ్యా! ఛాయారుక్రాడనగా మధ్యాహ్నతాంశవేధసాధిత సాయనార్కుడు. దృక్సిద్ధారుక్రాడనగా- సాంప్రతోపలబ్ధపరమఫలానురుద్ధముగ ఇష్టదినీయమందకర్ణానుపాతలబ్ధమందఫలసంస్కృతమధ్యమసూర్యుడు- ఈయిద్దరికిని గలయంతరమే అయనాంశలని తాత్పర్యముగాని లేఖకావస్థాప్రకారభేదము కాదని తెలిసికొనుడు- ౧౨వపంక్తి మొదలగు పంక్తుల యర్థమేగాని వేరుకాదు. అన్యోన్యాశ్రయవారణ జేసికొన నక్కరలేకపోవుటయేగాక సౌకర్యముగలుగునని పూర్వోక్తార్థమునే ఇష్టదినీయేత్యాదివాక్యము స్ఫుటపరచినందున పౌనరుక్త్యశంకాకళంకలేశావకాశము లేదు. యంత్రరాజము- గోళప్రకాశము-తత్త్వవివేకము- గ్రహసాధనకోష్టకము- వీటియందలి జ్యార్ధముల ననుసరించి శతమిత్రిజ్యానుసారముగ ప్రత్యంశజ్యార్ధములను పరిగ్రహించితి- ఆజ్యార్ధానుసారముగ అయనాంశకోటిజ్యాదికము సాధింపబడినది. ఆచార్యులవారు పరిగ్రహించిన పాశ్చాత్య జ్యాసారిణివలన సాధింపబడలేదు- కాన నీషద్వైషమ్యముండవచ్చును.

## ఫలితాంశము.

ఆచార్యులవారు స్వీయపరీధావి సంవత్సరశాస్త్ర దృక్సిద్ధపంచాంగమున చరమభాగమునందు సౌరాది ప్రాచీనశాస్త్రములయందు ప్రమాణబుద్ధిపూర్వకముగ సాధించిన అయనాంశలు యుక్తములనుగుణదోషప్రకాశికా వచనము సత్యమే- స్వీయప్రమాది పంచాంగమునందు మనపాతసిద్ధాంతములు పనికిరావని స్పష్టపరచినందున సాంతర ప్రాచీనసౌరానీత మధ్యరవితో నంతరించిన పాశ్చాత్యరవివల్ల సాధించిన అయనాంశలు శుద్ధములుగావని ఇపుడుచెప్పవలసివచ్చినది గనుక స్వవచనవ్యాఘాతమని శంకించ నవకాశములేదు.

హరిశ్చేహ భారతే సౌరప్రచారం హంతుముద్యతాః।
కేచిద్వ్యాద్యాతు హననే శక్తాం బ్రాహ్మీముపాస్మహే॥

## వారలేఖనప్రశంసా.

మయా ప్రకాశితా యా పత్రి గ్గుణదోషప్రకాశికా।
తత్ర తిథ్యంకతః పశ్చాద్వారాద్యక్షరలేఖనం॥
యుక్తమేవేతి సద్యుక్త్యా బహుధా ప్రతిపాదితం।
శృతసంధ్యాపద స్సమ్యక్ శాస్త్రయుక్తివివర్జితః॥
కృష్ణార్యో మయి తత్పశ్యన్ చక్రే నిందాం గరీయసీం।
శేషం కోపేనేతి వాచ స్సద్మభూర్యత్తతో హ్యసౌ॥
ప్రవృత్తౌ వా నివృత్తౌ వా ప్రమాణం శాస్త్రమేవహి।
భారతక్షేత్రజాతానాం నాన్యచ్ఛాస్త్రవిరోధ్యలం॥
తిథివాసరతారాయు క్కరణానా మనుక్రమాత్।
లేఖనే శరణం శాస్త్ర మస్మాకం శాస్త్రవర్తినాం॥
దైవజ్ఞవిలాసాదిగ్రంథేషు యతః క్రమాద్దృష్టం।
యస్మాత్తిథివారభయు క్కరణానాం ప్రోచ్యతే హి ఫలం॥
అనుక్రమేణ లేఖ్యాని తాని పంచ తతో విదా।
యతః స్వహో వాసరస్తేషాం తత్రత్యానాడికాస్తతః॥
తిథిసంఖ్యాంకతః పశ్చాద్వారాద్యక్షరతః పరం।
స్థితం ఘట్యాదికం యత్త న్నఘటేత తిథేర్గతి॥
పరీధావ్యబ్దపంచాంగే స్వీయే సమ్యక్సుధీవరః।
కృష్ణార్యో విలిలేఖ పత్రి కృద్దోషస్య నివర్తకం॥
ప్రత్యుత్తరం మయా సమ్యగ్దత్తం భూయ స్సఏవహి।
తత్పత్రి భాదిత్రయస్యాపి లేఖనీయం తథైవహి॥
ఇతి స్వకీయనిర్వాణే విలిలేఖ తదప్యసత్॥
యథా పత్రిసౌధగో దీపః రథ్యాయా ఉపకారకః॥

తత్రత్యవాసర స్తద్వ త్సర్వేషా ముపకారకః।
తతః పూర్వోక్త దోషస్య నావకాశోపిచ స్ఫుటం॥

భారతీయసజ్జనులారా!

కృష్ణాచార్యులవారి పరీధావివత్సర శాస్త్రిదృక్సిద్ధాంత పంచాంగమునందు "వారానంతరమందు వ్రాసిన ఘటికలు తిథికి సంబంధించుట యసంభవము." అనువాక్యమునకు "తిథ్యంకః ప్రథమాంత్రో త వాసరాద్యక్షరోభవేత్। సప్తమ్యంతో యతస్తస్మా న్మాదృశానాం న హిక్షతిః" దశమితిథి గురువాసరమున ఇంతపరిమితిగలదియని తాత్పర్యము" అని గుణదోషప్రకాశికా ద్వారకముగ ప్రత్యుత్తరమివ్వబడెను. వరిభూతబుద్ధిశాలురగునాచార్యులవారు అందుకు సంమతించియె "అయ్యా తరువాత వ్రాసిన పుష్యమినక్షత్రము సుకర్మయోగము గరకరణము మొదలైనవి ఏవారమందెంతపరిమిత యనితెలియును? లేక ఇవి ఏవారమందో తెలియనవసరము లేదా? మొదట గురువారమునందేయంటి రా గురువారమందు దశమి. ఇంతవరకు పుష్య మింతవరకు సుకర్మ ఇంతవరకు గర ఇంతవరకు అనిగదా యర్థము చెప్పవలెను. ఇచట వారము ముందే వ్రాయవలసివచ్చినది. కనుక దాక్షిణాత్యుల వ్రాతయే వీరికి శరణముగాకతప్పదు" అని స్వీయనిర్వాణచతుర్థపుట చరమ కాలమునం దేడవపంక్తి మొదలు గానవచ్చుచున్నది. ఇది యజ్ఞాన మూలమే. ఎట్లన ప్రాసాదార్థ మారోపించినదీపము స్వస్థానమునందుండియే రథ్యయం దెట్లుపయోగించుచున్నదో అటువలెనె ఇనోదయద్వయాంతర్వర్తియగు భూసావనదినమగు పంచాంగాంతఃపాతివారము స్వస్థానమునందుండియే తిథి నక్షత్ర యోగ కరణ విషామృత గ్రహాప్రవేశాదికమగు సకలమున కుపయోగించును. ఇది శిష్టదైవజ్ఞసంమతము. ఎట్లన గ్రహలాఘవ విశ్వనాథటీకయందు ౧౫ బుధేఘటి౩౮।౧౧ రోహిణీ నక్షత్రఘటీ ౯।౮ సాధ్యనామయోగఘటీ ౧౦।౩౬ ఇట్లున్నది. ఇచట వారముముందువ్రాయలేదు. ఇత్యాదికమును వీ రెన్నడు చూడలేదని తో

చుచున్నది. దైవజ్ఞవిలాసాదిగ్రంథములయందు తిథివారనక్షత్రయోగ కరణముల కనుక్రమముగ ప్రకరణములు చెప్పబడినవి. వాటి ననుసరించి సంధ్యావందనాద్యఖిల కర్మారంభమునందు- తిథివార నక్షత్రయోగకరణసంకీర్తన భారతీయశిష్టులు చేయుచుండిరి. కాన శాస్త్రీయశిష్టాచారాదరణముగల మాకు దాక్షిణాత్యుల వ్రాతశరణ మెట్లగును. కనుక "దాక్షిణాత్యుల వ్రాతయే శరణము-కాకతప్పదు" అను ఆచార్యుల వారి నిర్వాణవాక్యము శాస్త్రీయయుక్తిశూన్యమని బుధులూహించెదరు.

ఫలితాంశము.

పరీధావిసంవత్సర శాస్త్రదృక్సిద్ధ పంచాంగమునందు "వారానంతరమున వ్రాసిన ఘటికలు తిథికి సంబంధించవు" అను ఆచార్యులవ్రాతకు శాస్త్రీయయుక్తిపూర్వకముగ గుణదోషప్రకాశికయందు ప్రత్యుత్తర మివ్వబడెను. ఆచార్యులవారు గుణగ్రాహులగుటచే అందుకు సమ్మతించి నక్షత్రాదిత్రయమున కాప్రకారము తెలియనవసరములేదాయని స్వీయనిర్వాణమునందు శంకించిరి. విశ్వనాథ దైవజ్ఞాది శిష్టజనవ్యవహారము ననుసరించి ప్రాసాదారోపితదీప న్యాయముచే ప్రాగుక్త శాస్త్రీయయుక్తియే దత్తోత్తరమయ్యె.

---

స్వీయాజ్ఞారూపనిగమాశక్తి శ్రుత్యగ్రగోచరా।
పాషండఖండనాక్షీణదక్షా బ్రాహ్మీ జయత్యలం॥

కరణప్రశంసా.

మయాప్రకాశితా ప్రాగ్యా గుణదోషప్రకాశికా।
తత్రప్రపంచితం సౌరే స్థిరేషు కరణేష్వలం॥
మధ్యయోర్ద్వయోర్త్యయం యత్తన్నపాతభ్రంశమూలకం।
ఇతిధుర్వాణీతి సోమసౌరసిద్ధాంతవాక్యతః॥
తద్విజ్ఞామైవకల్పనాకార్యభూదాసీనోఽభవత్పునః।
కుర్వన్నాత్మస్తుతిం నమ్యజ్ఞయి నిందాంచభూయసీం॥

ధ్రువాంశేతి శ్లోకదళ మలిఖ త్స్వార్థసిద్ధయే।
అతోసావన్వయజ్ఞానహీనఏవేతి నిశ్చయః॥

దైవజ్ఞులారా!

కృష్ణాచార్యకృత పరీధావిసంవత్సరపంచాంగమునందు "ధ్రువక రణములలో రెండవదిగ సూర్యసిద్ధాంతమునం దిపుడు కనబడు నాగ మితరబహుగ్రంథశిష్ట వ్యవహారమునుబట్టి చతుష్పదముగ వ్రాయబడినది= ప్రాయః పాఠభ్రంశమని శంకించదగి యున్నదిగాని అనివార్యమగు ఉ పపత్తివిరోధము స్ఫురించలేదు." అని వ్రాసిరి. అందుపైని "ధ్రువాణి శకునిర్నాగం తృతీయం" అను స్థలమందు సౌరపాఠానుసారముగ చ తుష్పదమునకు తృతీయత్వము సిద్ధించుచుండగా తృతీయం అను విశేష ణము చతుష్పదమునకు వ్యర్థము. "ధ్రువాణిశకునిశ్చైవ చతుష్పాన్నాగ వంతతః। కింస్తుఘ్నం" అను సోమసిద్ధాంతవచనానుసారముగ నాగము తృతీయమై యున్నది. ఈనాగము సౌరపాఠానుసారముగ ద్వితీయముగ నుక తృతీయం అను విశేషణము నాగమునకు సార్థకమైనది. కనుక పాఠభ్రంశము లేదని గుణదోషప్రకాశికయందు ప్రకటింపబడినది ఇట్లుం డ ఆచార్యులవారు స్వీయనిర్వాణమునందు తృతీయం అను విశేషణము నకు గతి చెప్పక "దైవజ్ఞచక్రవర్తు లపరిశీలకులని ప్రపంచమునం దెవ్వరు నంగీకరించరు" అని ఆత్మశ్లాఘనము చేసికొనిరి. ఇంతియేగాక ప్రాచీనగ్రంథములను కల్లోలపెట్టుచున్నారని స్పష్టముగ దోచుచున్న ది. ఇకగూడ వీరిమాయను చూడుడు "ధ్రువాణిశకుని ర్నాగం తృతీ యం" ఇంతియేవ్రాసి అసంగతాన్వయము చెప్పి లోకులను వంచించు చుండిరి. ఇపుడు మేము పూర్తిగా వ్రాసెదము. "ధ్రువాణిశకుని ర్నా గంతృతీయంతుచతుష్పదం" ఇపు డెట్లగ్గమగునో వీరిసుశిక్షిత మెంతవ రకో మధ్యస్థులే పరిశీలించెదరు" అని స్వీయనిర్వాణమున పుట౧౧ శా౧ పం౫ యందున్నది. అర్థానుగతశిష్టవ్యవహారము ననుసరించి తృతీయం అను విశేషణమునకు సార్థకము చెప్పుట యసంగతాన్వయమో ఆర్షవి

రోధపూర్వకముగ తృతీయం అను విశేషణము చతుష్పదమునకు చెప్పట యసంగతాన్వయమో దర్భగర్భాగ్రధీశాలురగు బుధులూహించెదరు. ఈ విశేషణమునకు సార్ధకము చెప్పలేని యాచార్యులవా రన్వయజ్ఞానరహితు లనియేగదా చెప్పదగును. ఇట్లుండుటవలనగదా "కథంతస్మాజ్జ్యోతిస్తంత్ర స్వతంత్రతా" అని గుణదోషప్రకాశిక వచించినది. ఎప్పుడైన- తృతీయం- అను విశేషణమునకు అర్థవిరోధము లేకుండునటుల ఆచార్యులవారు సమర్థించుకొనవలసియున్నది.—

---

మహీపస్సుమనోద్వేషీ శ్రుతిమార్గనిరోధకః।
దృష్టోయయాహతో బ్రాహ్మీం విద్యాంతాం భావయామ్యహం॥

వారప్రవృత్తిప్రశంసా.

పరీధావ్యబ్దపంచాంగే శ్రీకృష్ణార్యేణధీమతా।
స్వీయే యా దర్శితా వారప్రవృత్తిస్సారసంమతా॥
సైవేతి సౌరసిద్ధాంతాన్మయా సమ్యక్ప్రసాధితా।
వాసరస్య ప్రవృత్తేస్తు ప్రయోజనమపి స్ఫుటం॥
సౌరవ్యాఖ్యానతస్సోమసిద్ధాంతవచనాత్తథా।
వాసిష్ఠవచనాత్సమ్యగన్యస్మాచ్చ ప్రపంచితం॥
తత్సమ్యగ్వీక్ష్య కృష్ణార్యః బహునామవిరాజితః।
విద్వాన్ స్వకీయనిర్వాణే సౌరభాష్యానుసారతః
భుజోదయాంతరాఖ్యాభ్యాం కర్మభ్యామేవ సిద్ధ్యతి।
వాసరస్యప్రవృత్తిస్సా సమ్యగిత్థం సమర్థితా।
యతోభానౌ నప్రదేయం భుజాంతరమితిస్ఫుటం।
భూధరఃప్రాహకించ శ్రీశౌనకశ్చ తథైవహి॥
కర్మోదయాంతరం సౌరే నోక్తమేవేతిభాష్యకృత్।
నృసింహదైవవిత్ప్రాహ సౌరభాష్యే కిలాపిచ॥
కమలాకరదైవజ్ఞః ప్రాహ కర్మోదయాంతరం।

వాసనాభాష్యమేవేతి స్వీయగ్రంథే పరిస్ఫుటం॥
తస్మాదేతద్ద్వయం వారప్రవృత్తౌ త్యాజ్యమేవహి।
సౌరానుయాయినా శాస్త్రశరణేన విజానతా॥

భారతీయదైవజ్ఞప్రవరులారా!

విద్వత్కృష్ణార్య పరీధావి సౌరపంచాంగమునందు గనపరచిన వారప్రవృత్తికాలము "వారప్రవృత్తిః" అను సౌరాంతర్గత శ్లోక రీతిగా సాధింపబడనందున సౌరవిరోధమనియు "నన్వేతత్కాలజ్ఞానం—"చాలనోక్త్యాస్సంగచ్ఛతే" అని "వారప్రవృత్తిః" అను సౌరాంతర్గతశ్లోక వ్యాఖ్యానస్థవాక్యముచేతను సౌరోక్తవారప్రవృత్తిజ్ఞానమువలన దేశాంతరసంస్కారము చేయనక్కరలేకనే గ్రహము స్వదేశవారప్రవృత్తికాలికు డగునని వారప్రవృత్తికి ప్రయోజనమును "వారప్రవృత్తేర్ఘటికాః" అను సోమసిద్ధాంతవచనముచేతను "వారప్రవృత్తివిజ్ఞానం" అను వాశిష్ఠవచనముచేతను ప్రయోజనాంతరముగూడ గనపరచి గుణదోషప్రకాశికాద్వారకముగ బ్రకటించితి. అందుపైని ఆచార్యులవారు స్వీయపంచాంగమునందలి వారప్రవృత్తికాలము సౌరసమ్మతమని సాధించుటకుగాను "అయ్యా! వెఱ్ఱిపడక భుజాంతరాది సంస్కారములుజేసి చూచుకొనుడు. సమముగ సరిపోవును. మీకు తెలియక చెప్పిన గ్రహించకపోవుట బుద్ధిమంతులకు లక్షణముకాదు. ఉదయాంతరసంస్కారము సూర్యసిద్ధాంతములో లేదంటిరేని సౌరభాష్య పరిశీలకులగు తాము యీమాట యనరాదు "తేన" యను శ్లోకభాష్యమును జూడుడు "యద్యప్యత్రోదయాంతరం నోక్తం తథాపి గ్రహేషు సంస్కార్యమేవ అన్యైశ్చాప్తైరుక్తత్వా ద్వాసనాసిద్ధత్వాచ్చ తత్రవాసనోచ్యతే" ఇత్యాదినా వాసనామభిధాయ "ఇదముదయాంతరం స్వల్పాన్తరత్వా దన్యమునిగ్రంథేషు ప్రసిద్ధత్వాన్నోక్తం॥ అని యున్నది. గ్రహోదయ అనే శ్లోకములో "అనేనైవశ్లోకేన గ్రహాణాముదయాన్త

రశర్మాప్యస్తీత్యుక్తం భవతి ॥ అని గూఢార్థప్రకాశికలో నున్నది. ఇది మీకు ప్రమాణము కాకపోయినా సౌరాభాష్యము ప్రమాణముగాదా- దృక్కర్మవాసనలో గూడ "నదృక్కర్మణోఽహర్గణావయవభూతోదయాన్తరచర దేశాంతరరవిమందఫలవదహర్గణావయవత్వేన సంస్కరణం" అని భుజాంతరోదయాంతరములుగూడ అహర్గణావయవములని యున్నది. సౌరభాష్యమందు మేషాయనదినమందు మందకేంద్రము శూన్యము గాదు గాన భుజాంతరము తప్పకయుండుటకు సందియము లేదు" అని ఆచార్యులవారు స్వీయనిర్వాణ పంచమపుట యిరువదితొమ్మిదవపంక్తిల గాయతు వ్యక్తపరచిరి- "యద్యప్యత్ర" ఇత్యాదిగ్రంథము సౌర భాష్యాదులలోనిదిగాని సూర్యసిద్ధాంతమూలములోనిది కాదుగదా- ౧ భుజాంతరసంస్కారము- ౨ ఉదయాంతరసంస్కారము- ఇవి చేసినచో తమ వారప్రవృత్తికాలము సిద్ధమగునని పైగ్రంథమునను సరించి యాచార్యుల వారియభిప్రాయము. ఇందు మొదటిదియగు భుజాంతరసంస్కారము "అర్కబాహుఫలాభ్యస్తా గ్రహభుక్తిర్విభాజితా । భచక్రకలికాభిస్తు లిప్తాః కార్యా గ్రహేఽర్కవత్" అను సూర్యసిద్ధాంత శ్లోకముచే చెప్పబడినది. ఈసంస్కారము చంద్రాదిగ్రహములయందు చేయదగినదికాని సూర్యునియందు చేయతగినదికాదు. సూర్యుడు స్ఫుటార్థరాత్రకాలికుడే "సూర్యశ్చస్ఫుటార్ధ రాత్రకాలీన ఏవాతః సూర్యస్య నాయం సంస్కారః॥" అని భూధరాచార్యులు "భానుబాహుఫలాభ్యస్తా గ్రహభుక్తిస్సముద్ధృతా। లిప్తా భచక్రలిప్తాభి రనర్కే తిమిరారివత్॥" అని సోమసిద్ధాంతమునందు చెప్పియున్నది. ఈశ్లోకచతుర్థపాదమున కర్థము వ్రాయుచున్నను. అనర్కే అర్కో న భవతీత్యనర్కః సూర్యేతరః తత్ర సూర్యవత్ప్రతికర్మగ్రహే తిమిరారివత్- తిమిరారౌ సూర్యే మందఫలంయథా- ధనమృణంవా భవతి తథైవ దేయమిత్యన్వయః- ఈసంస్కారము సూర్యునియందుగూడ చేయునెడ- అనర్కే అను పదము

వ్యర్థమగును- కనుకనే భూధరాచార్యులుగూడ "సూర్యశ్చ స్ఫుటార్థరాత్రకాలీన ఏవాతః సూర్యస్యనాయంసంస్కారః" అని వ్రాసెను. "చంద్రాదిగ్రహాలిప్తాసు అర్కవత్కార్యాః॥ తథాచసోమసిద్ధాంతే॥ "అనర్క తిమిరారివదితి" అని యల్లయాచార్య వ్యాఖ్యానము. ఇదియునుంగాక "తస్మాందమసకృద్వామం ఫలంమధ్యే దివాకరః" అని సూర్యసిద్ధాంతమునం దున్నదిగదా- స్ఫుటరవివలన అసకృత్సాధిత మందఫలము స్ఫుటార్కునిలో విలోమముగ సంస్కరించిన అహర్గణానీతమధ్యరవి వచ్చును. ఇందువలన మధ్యమార్క స్పష్టార్కాంతరము మందఫలముమాత్రమేగాని యన్యము లేదనియేగదా తాత్పర్యము. భుజాంతరము సూర్యునియందు చేయవలెననియే సౌరాభిప్రాయమైనయెడల ఈస్థలమందు భుజాంతరము విలోమముగ స్పష్టసూర్యునియందు సంస్కరించమని చెప్పునుగదా- కాన భుజాంతరము సూర్యునియందు సంస్కరించదగదని సౌరాద్యార్షసిద్ధాంతముల యభిప్రాయము.

ఇక ఉదయాంతరమునుగూర్చి.

"యద్యప్యత్రోదయాంతరసాధనం నోక్తంతథాపి గ్రహేషుసంస్కార్యమేవ" అనిగదా సౌరభాష్యమందున్నది. ఇందువలన సూర్యసిద్ధాంతమం దుదయాంతర సంస్కారము చెప్పబడలేదు. అని స్పష్టపడినది. ఇందువలన ఉదయాంతరము సౌరవిరోధియేగదా- ఉదయాంతరము శిరోమణియందు చెప్పబడినది. శిరోమణికిమూలమగు బ్రహ్మగుప్తమునందుగూడ చెప్పబడలేదు. బ్రాహ్మంస్ఫుటసిద్ధాంతమధ్యాధికారాంతర్గత "లంకాసమయామ్యోత్తర రేఖాయాం" అనుశ్లోకవ్యాఖ్యానమునందు- అత్రోదయాంతర సంస్కారేణ వాస్తవాః స్వనిరక్షోదయేగ్రహాః భవంతీతిభాస్కరేణోదయాంతరసంస్కార ఆనీతః॥ అని యున్నది. ఇందువలన ఉదయాంతర సంస్కారము భాస్కరప్రోక్తమేగాని సోమాద్యార్షసిద్ధాంతములయందుగాని బ్రహ్మగుప్తాది ప్రాచీనదైవజ్ఞకృత గ్రంథ

ములయందుగాని చెప్పబడలేదు-శుద్ధసిద్ధమని కాబోలు సిద్ధాంతతత్త్వవి వేకమునందు దుదయాంతర సంస్కారమును గూర్చి వ్రాసిన గ్రంథమును ఆచార్యులవారు పరిశీలించియుండలేదు. తత్త్వవివేకమునందు దిట్లున్నది. "అతః కృతాహర్గణో మధ్యమసావ నేనేత్యుదయాంతరసంస్కారణ మయుక్తమితి ప్రతిభాతి। అర్థానుక్తేశ్చ। అత్రేదంగోలతత్వార్థజ్ఞైర్మధ్యస్థబుద్ధ్యా నిపుణం విభావనీయం॥ ఏతేనవస్తుస్థితేరనవబోధా దహర్గణే అవాస్తవభ్రాంత్యా స్వజ్ఞానోత్కర్షకుగర్వ ప్రౌఢ్యామంద ప్రతారణద్వారా న్యథాకర్తుం ప్రవృత్తైర్భాస్కరాచార్యైరేవ బలాత్సర్వదేవజ్ఞమతవిరుద్ధ స్సద్గోలవాసనావిచారబహిర్భూతః స్వకల్పితోఽసదుదయాంతర వాసనా విచారః ప్రవర్తితః" ఇందువలన ఉదయాంతర మార్గసంమతముగాదనియు సద్గోలవాసనావిరహితమనియు స్పష్టమగుచున్నది. ఉదయాంతరము సుధాకరసంమతముగూడ కాదని తత్త్వవివేక టిప్పణివల్ల సూచింపబడుచున్నది. కాన భుజాంతరోదయాంతరరూప కర్మద్వయము వారప్రవృత్తిసాధనమున్నకై చేయుదగదని నిశ్చయముగ తెలిసికొనదగినది. ప్రాజ్ఞులగు భారతీయ లాగ్గమతానుయాయులుగదా—

కర్త్వార్తత్వం వాసరస్యాస్తియద్య
త్సద్గోరాయాశ్చేతి సత్యం వదన్ నః।
సారానీతావాసరస్య ప్రవృత్తిః
కర్త్వార్తేతి ప్రాహ యత్తచ్చ మాధ్యం॥
న చ కర్మకారవేతనదానాదావేవవాశిష్టం।
అన్యేష్వితి వచనమితి ప్రాహయతోఽతోయమేవాజ్ఞః॥

భారతీయకోవిదులారా!

"ముహూర్తగణపతౌ" యస్మిన్వారేచ యత్కృత్యం పూర్వాచార్యైరుదాహృతం। తత్కృత్యం తస్యఖేటస్యహోరాయాంఖిలుసిద్ధ్యతి" అని యున్నదిగనుక వారమునకు గలకర్త్వాగత వారహోరకు ముఖ్యము

గనుండును. కనుక సౌరానుసారముగ సాధించిన వారప్రవృత్తికూడ కర్త్వాగ్రము కాదనుటకంటె అవివేకముగలదా-మరియు తాముదహరించిన సోమసిద్ధాంతవచనము "వారప్రవృత్తేర్ఘటికాః=క్షణవారాధిపాస్స్మృతాః॥ ఇందువలన వారప్రవృత్తి దగ్గిరనుంచే హోరాధిపతులను నిర్ణయించవలెను "అన్యేషుసర్వకార్యేషుదినాదిరుదయోరవేః" అను చోటశాస్త్రీయ కార్యేతరకర్మకారవేతనదానాదులలో ఉదయాదియని యర్థము" అని ఆచార్యులవారి నిర్వాణమున పుట౫ కా౨ పం౧౮యందున్నది. అయ్యా! అచార్యులవారు ముహూర్తగణపతియందు "యస్మిన్వారేచయత్కృత్యం" అనుశ్లోకమును మాత్రముచూచి మీదుగాన కిట్లు వ్రాసిరి. ఏమన- ముహూర్తగణపతియందు అథ ప్రత్యేకం వారకృత్యం "రాజాభిషేకమాంగల్యం" ఇత్యాదిశ్లోకములచే ప్రత్యేకవారకృత్యమును చెప్పి॥"అథ తాత్కాలిక వారకృత్యార్థం హోరా ప్రోచ్యతే॥ స్వదేశ మధ్యరేఖాంతరోద్యజనైః పాదవర్జితైః।" ఇత్యాదిశ్లోకములచే స్వదేశవారప్రవృత్తికాలమును చెప్పి- "వారారంభాద్గతానాడ్యః" ఇత్యాదికముచే కాలహోరాధిపతిసాధనము చెప్పి పిమ్మట యస్మిన్వారేచ యత్కృత్యం అనుశ్లోకము చెప్పబడినది. ఇందువలన తేలినఫలితమేమనగా-సాంహితిక సంహిత కర్మోపయోగ వారప్రవృత్తికాలము స్వదేశ సూర్యోదయాదిగా సాధింపబడెను. సాంహితికులు "సావనం స్యాద్దినం భానో రుదయా దుదయం" అను న్యాయముచేతనే వారము నంగీకరించి వారకృత్యమును విస్తరించి పిమ్మట తాత్కాలిక హోరయందు గూడ వారకృత్యము సిద్ధించునని "యస్మిన్వారేచ యత్కృత్యం అని చెప్పిరి. ఇట్లుండ గ్రంథములను సమగ్రముగ పరిశీలించక "యస్మిన్వారేతుయత్కృత్యం" అను శ్లోకమును మాత్రము చూచి స్వాభిప్రాయానుసారి లేఖన మవివేకమని గ్రంథద్రష్ట లూహించెదరు. సాంహితికోక్త వారకృత్యము సంగతిచే తత్సంమత కాలహోరయందు సిద్ధించును. కాని

సైద్ధాంతిక వారప్రవృత్తికాలమువలన సాధించిన హోరయందు సిద్ధించుననుట యసంగతము - రత్నమాలా చింతామణ్యాది గ్రంథములయందు స్వీయ సూర్యోదయాది వారానుసారముగనే వారకృత్యము హోరాసాధనము చెప్పబడినదిగాని సైద్ధాంతిక వారప్రవృత్తికాలము వలన చెప్పబడలేదు. "యద్యదుద్దేశేన ప్రవృత్తం తత్తదంశఏవ ప్రమాణం" అను న్యాయమువలన సైద్ధాంతిక వారప్రవృత్తికాలము గ్రహగతిసాధనోద్దేశ ప్రయోజకము- సాంహితికోక్త వారప్రవృత్తికాలము కర్మసాధనోద్దేశ ప్రయోజకము- ఇట్లుండ సైద్ధాంతిక వారప్రవృత్తికాలసాధిత హోరయందు సాంహితికోక్త వారకృత్యము సిద్ధించుననుట గ్రంథావలోకనాలసత్వమువలన గలిగిన మాఢ్యమనియేకదా ప్రాజ్ఞులూహించెదరు. "వారప్రవృత్తివిజ్ఞానం" అను వాశిష్ఠవచనము గుణదోష ప్రకాశికయం దుదహరించిరి. ఈవచన పూర్వార్థము తమకు బాధకముగుటవలన దానిని స్మరించక "అన్యేషు సర్వకార్యేషు" అను ఉత్తరార్థమునకు "శాస్త్రీయేతర కర్మకారవేతన దానాదులలో ఉదయాదియని యర్థము" అనిరి. పూర్వార్థమునందున్న ఏవకార మితరవ్యవచ్ఛేదార్థకముగదా- ఇందువలన క్షణవారేతర శ్రౌతస్మార్తరూపనిత్యనైమిత్తిక కామ్యకర్మలయందు- అని అర్థబోధ యగును గాని శాస్త్రీయేతర కర్మకారవేతన దానాదులయం దని అర్థబోధ యెట్లు కలుగును. ఇట్లనుట అజ్ఞానమూలకమే గదా-

ఉదయాదుదయంభానో రిత్యత్ర ప్రాహ యత్నోపి।
యమకోట్యర్కోదయ ఇతి సారాదివిరోధతోఽసత్త్వత్॥
యమకోట్యర్కోదయతో జాతాదిక మాచరంత్యస్మిన్।
దేశ ఇతి సోఽబ్రవీ ద్యత్తత్తు విచారోద్భవం నైవ॥

భారతీయులారా!

"ఉదయాదుదయంభానో స్స్నావనం తత్ర్పకీర్తితం। సావనాని స్యురేతాని యజ్ఞకాలవిధిస్తుతైః॥ సూతకాదిపరిచ్ఛేదో దినమాసాబ్దపా స్త

థా। మధ్యమాగ్రహభుక్తిస్తు సావనేనైవ గృహ్యతే॥" అనుచోట గూఢార్థప్రకాశికలో "ఏతేనోదయద్వయాత్మక కాలగణనయా సావనాని వసుద్వ్యష్టాద్రీత్యాదినా మధ్యాధికారోక్తాని భవంతి" అని యున్నది గనుక యమకోట్యర్కోదయమని చెప్పక తప్పదు. మరిన్ని, ఉత్తరశ్లోకములో "సూతకాదిపరిచ్ఛేదో=గృహ్యతే" అని యున్నది. యమకోట్యుదయాదిగా సూతకాదివ్యవహారము మనదేశమందున్నది గాని మన సూర్యోదయాదిగా ఆచారము లేదు." అని ఆచార్యులవారి నిర్వాణమున పుట ౫ కా ౨ పం ౨౬ లో నున్నది. "భూవృత్తపాదే ఘూగ్వస్యాం యమకోటీతి విశ్రుతా" అను సౌరోక్తివలన యమకోటి సూర్యోదయ కాలమునగా లంకార్ధరాత్రమే- కనుక లంకార్ధరాత్రము మొదలు అవ్యవహిత లంకార్ధరాత్రపర్యంతము సావనదినమనిగదా ఆచార్యులవారి యాశయము. అట్లైన అర్ధరాత్రాదర్ధరాత్రం సావనం అని సౌరమందు చెప్పవలెను గాని ఉదయాదుదయం అని యెందుకు చెప్పవలెను. ఇదిగాక- సూర్యసావనబోధకమగు "ఉదయాదుదయంభానోర్భూమిసావనవాసరః" అని సూర్యసిద్ధాంతమధ్యాధికారాంతర్గత ౩౬ శ్లోకము. "ఉదయాదితి॥ సూర్యస్యోదయకాలమారభ్యావ్యవహిత తదుదయకాలపర్యంతం యః కాలస్సఏవ దివసః" అని గూఢార్థప్రకాశిక॥ "త్రింశతాక్షణమాసస్స్యాత్సావనోర్కోదయైస్తథా॥" అని సోమసిద్ధాంతవచనము. వీటియందు యమకోటి సూర్యోదయమని లేదుగదా "సావనంస్యాదిదం భానో రుదయాదుదయంభవేత్। తదేవ భూదినం వారస్స్వదేశార్కోదయాదితః" అని వాశిష్ఠవచనము ఇందువలన స్వదేశసూర్యోదయాద్య వ్యవహిత సూర్యోదయావధిక కాలము సావనాహోరాత్రమని స్పష్టమగుచున్నది. ఇట్లుండ "ఉదయాదుదయంభానోస్సావనం తత్ప్రకీర్తితం" అను సౌరవచనమునకు యమకోట్యుదయమని అర్థము చేసినచో వాశిష్ఠవచనవిరోధము దుర్వారమగును గనుక "య

మకోట్యుదయమని చెప్పకతప్పదు." అను ఆచార్యులవారి నిర్వాణవచనము వివేకశూన్యమైనది. మరియు "యమకోట్యుదయాదిగా సూతకాదివ్యవహారము మనదేశమం దున్నది" అను నిర్వాణవచన మత్యంతాసంగతము. ఎట్లన- యమకోట్యుదయమనగా లంకార్ధరాత్రము. ఇయ్యది మనసూర్యోదయాదిగా ౪౬।౨౨ ఘటికాదికాలమునందు మేషతులాయన దినములయందును, ౪౭।౪౧ కాలమునందు కర్కాటకాయన దినమందును, ౪౫।౩ కాలమునందు మకరాయణ దినమందును లంకార్ధరాత్రసమయమగును. అట్టి కాలమువలన సూతకాది వ్యవహారము మనదేశమునం దాచారములేదు. "రాత్రింకుర్యాత్ త్రిభాగంతు ద్వౌభాగౌ పూర్వవాసరే" అను వచనానుసారముగ స్వదేశీయేష్టదిన రాత్రి తృతీయభాగమువరకు పూర్వదినముగను, అనంతరమందు పరదినముగను జాతాదులయందు మనదేశమునందు శిష్టవ్యవహారము గలిగియున్నది. ఇట్లుండ యమకోటి సూర్యోదయరూప లంకార్ధరాత్రాదిగా సూతకాదివ్యవహారము మనదేశమం దున్నదనుటకంటె అవివేకము కలదా? శ్రౌతస్మార్తకర్మలయందు "ఉదయాదుదయం" అను స్మారవచనానుసారముగ తత్తత్కర్మ విహితదిన సంఖ్యను స్వదేశసూర్యోదయాదిగానే గ్రహించుచున్నారు. ఇది నిర్వివాదాంశమే. ఇచట సావనదినారంభము విషయముగాని యాశౌచనిర్ణయము విషయముగానందున "అత్రపరాశరః" అని మొదలు "తోచుచున్నది" అనువరకు గల ఆచార్యులవారి గ్రంథము విమర్శించనవసరములేదు. సూతకాదివ్యవహారము గుణదోషప్రకాశికయందు సూర్యోదయాదిగా జేయవలెనని ప్రకటించి యుండలేదు.

సౌమ్యాయనం దైవమహో నిశాం యామ్యాయనం జగుః।
ఆసురం యామ్య మయన మహః స్సౌమ్యం నిశామితి॥
కృష్ణః పిత్ర్య మహశ్శుక్లో రాత్రిరిత్యభిధీయతే।

దైవంపిత్ర్య మహోరాత్రం యథాపూర్వైః ప్రకీర్తితం॥
కర్మోపయోగ్యహోరాత్రం నిర్ణేయం మానుషంతథా।
హాలికాఇవ సూర్యస్య దర్శనాద్ధి దినంజగుః॥
అదర్శనాన్నిశాంచేతి యత్తన్మూర్ఖజనాశ్రయం।
అర్ధరాత్రాది మధ్యాహ్నం యావత్తావద్దినంభవేత్॥
మధ్యాహ్నాదర్ధరాత్రంహి యావత్తావన్నిశేతిచ।
కృష్ణాచార్య స్స్వనిర్వాణే యజ్జగాద తదప్యసత్॥
సౌరాద్యార్షవిరోధాచ్చ కించ శ్రుతివిరోధతః।

నిష్పాక్షిక బుధులారా!

"అహోరాత్రపరిమితత్వ నియమేన వాసరే సందేహాభావాత్। అనుచోటగూడ దేవాహోరాత్రపిత్రహోరాత్రములవలె మనకు కర్మోపయోగి అహోరాత్రము నిర్ణయించతగినది కాని హాలికులవలె తెల్లవారితేపగలు- పొద్దుగుంకితే రాత్రి యని యత్తానురూపోబలిః అను న్యాయముచే మూర్ఖులతో వ్యవహరించు సమయమునదప్ప శాస్త్రీయవ్యవహారమందు చెప్పుట యవివేకకృతము. దేవతలకు ఉత్తరాయణముదినము- దక్షిణాయనము రాత్రి- ఇట్లే పితృదేవతలకు కృష్ణపక్షము దినము శుక్లపక్షము రాత్రి- అని జగద్విదితము. ఇచట అర్ధరాత్రి మొదలు దినము. మధ్యాహ్నము మొదలు రాత్రియని చెప్పకతప్పదు. ఈ అహోరాత్రములే సమస్తకర్మోపయోగులు. ఇందుకు సిద్ధాంత శిరోమణి "దినంసురాణా మయనం యదుత్తరం నిశేతరత్సంహితికైః ప్రకీర్తితం। దినోన్ముఖేర్కే దినమేవతన్మతం నిశాతథాతత్ఫలకీర్తనాయతత్॥ ద్వంద్వాంతమారోహతి యైః క్రమేణతైరేవవృత్తైరవరోహతీనః। యత్తైర్వదృష్టః ప్రథమం నదేవైస్తత్తైర్వతిష్ఠన్నవిలోక్యతేకిం॥విధూర్ధ్వభాగే పితరో వసంతస్స్వధస్సుధాదీధితిమామనంతి। పశ్యంతితేర్కం నిజమస్తకోర్ధ్వే దర్శేయతోస్మాద్ద్యుదళంతదేవ। భార్ధాంతరత్వాన్నవిభోరధస్థంతస్మాన్ని

శిథః ఖలుపౌర్ణమాస్యాం। కృష్ణే.రవిః పక్షదలేఘ్యుపైతి శుక్లేన్త్యమేత్యర్ధ
తపవసిద్ధం। అను శ్లోకములను బోధపరచుకొనవలెను. శ్రీపతిగూడ
“శిశిరపూర్వమృతుత్రయముత్తరం హ్యయనమాహు రహశ్చతదామరం।
భవతిదక్షిణమన్య దృతుత్రయం నిగదితా రజనీ మరుతాంచసా॥గృహప్ర
వేశత్రిదశ ప్రతిష్ఠా వివాహచౌలవ్రత బంధపూర్వం। సౌమ్యాయనే కర్మ
శుభం విధేయం యద్గర్హితం తత్ఖలుదక్షిణేచ॥ ఇట్లు చెప్పెను గనుక అ
ర్ధరాత్రాదిదినవారగ్రహణమే కర్మోపయుక్తము” అని ఆచార్యులవారు
స్వీయసిర్వాణమునం దారవపుటాద్యకాలమునం దేడవపంక్త్యాదిగా
వివరించిరి.

సూర్యోదయానంతరము దినమనియు, సూర్యాస్తమయానంతర
ము రాత్రియనియు, మనదేశమందలి వ్యవహారము కర్మోపయోగము కా
దనియు, కర్మోపయోగమైనఅహోరాత్రము దైవపిత్రహోరాత్రములవలె
నిర్ణయించతగియున్నదనియు అందుకుప్రమాణముగ “దినంసురాణాం”
ఇత్యాది భాస్కరాదివచనముల నుదహరించిరిగదా- “భానోర్మకరసం
క్రాంతే ష్షణ్మాసాఉత్తరాయణం। కర్కాదేస్తుతథైవ స్యాత్షణ్మాసా దక్షి
ణాయనం। అను సౌరోక్తరీతిచే ఉత్తరాయణ మనగా సూర్యుడు మ
కరాదిరాశి షట్కగతుడగుకాలము దేవతలకు పగలు, దక్షిణాయనమ
నగా సూర్యుడు కర్కటాదిరాశి షట్కగతుడగుకాలము దేవతలకు
రాత్రి- ఇట్టిదినరాత్రిస్వరూపకాలము దేవాహోరాత్రమని సాంహితిక
మతము. “ మేషాదావుదితస్సూర్య స్త్రీన్రాశీనుదగుత్తరం। సంచర
న్ప్రాగహర్మధ్యం పూరయేన్మేరువాసినాం॥ కర్కాదీన్ సంచరంస్తద్వ
దహ్నః పశ్చార్ధమేవ సః। తులాదీం స్త్రీన్మృగాదీంశ్చతద్వదేవసురద్వి
షాం॥ అతోదినక్షపే తేషా మన్యోన్యంహి విపర్యయాత్। అహోరాత్ర
ప్రమాణంచ భానో ర్భగణపూరణాత్ । దినక్షపార్ధమే తేషామయనాంతే
విపర్యయాత్॥ అను సూర్యసిద్ధాంతవచనములచే సాయనరవి మేషాది

యందు దేవతలకు సూర్యదర్శనమగుటవలన నది దివ్యదినారంభము. సాయనరవి తులాదియందు దేవతలకు సూర్యాదర్శనమగుటవలన నది రాత్ర్యారంభము- సాయనరవి కర్క-మకరాదులు దినమధ్యరాత్రిమధ్యములగుటవలన నవి మధ్యాహ్నమధ్యరాత్రములు. సూర్యునకు భచక్రభ్రమణకాలము దివ్యాహోరాత్రము. అని చెప్పబడినది. ఇందువలన దేవతలకు సూర్యదర్శనము దినాది. సూర్యాదర్శనము రాత్ర్యాది- అని స్పష్టపడినది. ఇట్లాపోక్త దివ్యదినరాత్రులకు సాంహితికోక్త దినరాత్రులు భిన్నమగుటవలన "దినం సురాణామయనం" అను శ్లోకముచే సాంహితిక మతమున్ను వ్యక్తపరచి "ద్వంద్వాంతమారోహతి" యను నుత్తరశ్లోకముచే సాంహితికమత మసత్యమని నిరాకరింపబడెను. ఇట్లే "మేష వృష మిథున సంస్థే=యేష్వహోద జ్ఞేషాత్" అను శ్లోకద్వయముచే వరాహమిహిరుని చేగూడ సాంహితికమతము ఖండింపబడినది. ఖండితమతము ననుసరించి దేవాహోరాత్రమువలె మానుషాహోరాత్ర మర్ధరాత్రాదియనిరి. దానిని ఉపమగా తీసుకొని శ్రీదూరులగు ఆచార్యులవారిచే స్థాపింపబడిన అర్ధరాత్రాది మానుషాహోరాత్రము కర్తార్థ మనునది ఖండింపబడకుండునా—ఇట్లే "పితృదేవతలకు కృష్ణపక్షముదినము. శుక్లపక్షము రాత్రియని జగద్విదితము" అనివ్రాసిరి. కాని దానికి ప్రమాణము కనపరచలేదు. కనుక నది పామరజనోక్తియని యూహించదగును "విధూర్ధ్వభాగే పితరోవసంతః" అను శిరోమణివచనము పితృదినజ్ఞానార్థ ముదహరించిరిగదా- ఇందువలన పితృదేలతలకు కృష్ణాష్టమ్యుత్తరార్ధాదియందు దినారంభము. దర్శావసానము మధ్యాహ్నము- శుక్లాష్టమ్యుత్తరార్ధాదియందు రాత్ర్యారంభము. పూర్ణిమాంత మర్ధరాత్రము అనిగదా స్పష్టపడినది. ఇట్లే "త్రింశతాతిథిభిర్మాసశ్చాంద్రః పిత్ర్యమహస్స్మృతం। నిశాచమానవఞ్ఝాంతే తయోర్మధ్యే విభాగతః॥" అను సూర్యసిద్ధాంతవచనముగూడ చెప్పుచున్నది. వీటివ

లన కృష్ణశుక్లపక్షములు పితృదేవతలకు దినరాత్రులు కావనియేగదా శాస్త్రసంమతము- ఇట్లుండ కృష్ణపక్షముదినము- శుక్లపక్షము రాత్రియని జగద్విదితము ” అవు ఆచార్యవాక్య మశాస్త్రీయము గాక తప్పదు గదా- “విధూర్ధ్వభాగే పితరోవసంతః” అను శిరోమణివచనమువల్లను- “త్రింశతాలిథిభిః” అను సౌరవచనమువల్లను- కృష్ణాష్టమ్యర్ధరాత్ర ప్రారంభమునందు శశిపృష్ఠవాసులకు సూర్యదర్శన మగుటవలన నది దినారంభము- శుక్లాష్టమ్యర్ధరాత్రప్రారంభమునందు సూర్యా దర్శనమగుటవలన నది నిశారంభమని స్పష్టపడినది.

ఇందువలన పితృదేవతలకును- సూర్యదర్శనాదర్శనములవల్లనే దినరాత్ర్యారంభములని స్పష్టపడినది. కనుక దేవతలకును పితృదేవతలకును సూర్యదర్శనాదర్శనములవలన దినరాత్రిప్రారంభము లెట్లు సిద్ధించినవో అటువలెనె భూస్థులకుగూడ సూర్యదర్శనా దర్శనములవల్లనే దినారంభము నిశారంభము అగుననుటకు నిస్సంశయమే॥ ఇది గాక॥ శ్రు॥ “నవాఏషనకదాచనాస్తమేతినోదేతితం యదస్తమేతీతిమన్యంతే అహ్నఏవతదంతమిత్వాథాత్మానం విపర్యస్యతే రాత్రిమేవావస్తాత్కురుతేஉహః పరస్తా దథయదేనం ప్రాతరుదేతీతిమన్యంతే రాత్రేరేవతదంతమిత్వాథాత్మానం విపర్యస్యతే॥” ఈశ్రుతివలన అహరవసానమే సూర్యాస్తమయము. రాత్ర్యవసానమే సూర్యోదయము అనిస్పష్టపడినది. ఇందువలన ఉదయాస్తమయాంతర్వర్తి కాలము దినమనియు- అస్తోదయాంతర్వర్తి కాలము రాత్రియనియు స్పష్టపడినది. శ్రు॥ “ఆగ్నేయీవై రాత్రిః। ఐంద్రమహః।” భాష్యము॥ “రాత్రావగ్నేః ప్రకాశాధిక్యాద్రాత్రిరాగ్నేయీ- ఇంద్రశబ్దేన పరమైశ్వర్యయోగాత్సూర్యోஉత్ర వివక్షితః। తద్యోగాదహస్సౌరం। ఏవంసతి ఉదయాత్ప్రాచీనస్సర్వోஉపికాలః రాత్ర్యంతఃపాతీ॥” అని సాయనభాష్యము॥ శ్రు॥ “చిత్రః కేతుః ప్రభానాభాం త్స్వంభాః॥” భాష్యము- “చిత్రః కేతురిత్యాదయః

పంచదశయేశబ్దాః తే శుక్లపక్షగతపైకైకస్మిన్నహనిఉదయాస్తమయమధ్యవర్తినాం నామధేయాని-'' అని సాయనభాష్యము॥ ఈశ్రుతులవలన సూర్యోదయాస్తకాలములు దిననిశారంభములని సిద్ధించినది. శ్లో॥ తత్రార్కస్య ముదక్క్రాంతౌ ధనహానీ పృథక్స్థితే। స్వాహోరాత్రచతుర్భాగే దినరాత్రిదలేస్మృతే। యామ్యక్రాంతౌ విపర్యస్తే ద్విగుణేతు దినక్షపే॥ అను సూర్యసిద్ధాంత వచముచే దినమానరాత్రిమానములు స్వదేశసూర్యోదయాస్త కాలములవలన సాధింపబడినవి. కనుక సూర్యోదయాదిదినమనియు, సూర్యాస్తాదిరాత్రియనియు స్పష్టమైనది. ఇత్యాది శ్రుతులవల్లను సిద్ధాంతములవల్లను ప్రసిద్ధమైన దినరాత్రులకు మూర్ఖులతో వ్యవహరించుటయే ప్రయోజనమని ప్రాజ్ఞులు విశ్వసించరు. వేదవేదాంగములు మూర్ఖజనవ్యవహారమును ప్రకటించుచున్నవి యనిన ఎవరు విశ్వసింతురు. అర్ధరాత్రి మొదలు దినము. మధ్యాహ్నము మొదలు రాత్రి. అనిగదా ఆచార్యులవారి ఆశయము. ఇందువలన సంధ్యాసంధ్యాముపాసీత- ఇత్యాది శాస్త్రసిద్ధమగు సంధ్యావందనాది నిత్యకర్మలు ఆచార్యులవారి మతప్రకారమగు అహోరాత్రసంధిరూపమగు స్వదేశార్ధరాత్రమునందు ప్రసక్తించును. సంధ్యోపాస్త్యనంతరకాలిక అగ్నిహోత్రాదికముగూడ తదవ్యవహితోత్తరకాలమునందే ప్రాప్తించును. సంమతమనిరేని- ''ఉదితేసూర్యే ప్రాతర్జుహోతి'' ''ఉదితఆదిత్యే'' ఇత్యాదిశ్రుతులు దత్తజలాంజలులగును-

ఉత్తరాంతు యదా కాష్ఠాం క్రమాదాక్రమితేరవిః। తదాతదా భవేద్వృద్ధి ర్దివసస్యమహాభుజ=దినవృద్ధి ర్యదారామదోషాహానిస్తదాభవేత్॥ ఇత్యాది విష్ణుధర్మోత్తరాది వచనములకున్న దత్తజలాంజలిత్వము ప్రసక్తించును. లేక ఉదితేసూర్యే అను స్థలమందు యమకోటి సూర్యోదయమని చెప్పెదరేమో- అట్లైన భారతీయశిష్టవ్యవహారవిరోధము దుర్వారమగును. ఇదిట్లుండనిండు.

"ఉదయాదుదయంభానోః సావనం తత్ప్రకీర్తితం। సావనాని స్యురేతాని యజ్ఞకాలవిధిస్తుతైః॥" ఈవచన పూర్వార్ధముచే సావనదినలక్షణమును, ఉత్తరార్ధముచే సావనదినవ్యవహారమును చెప్పి "సూతకాదిపరిచ్ఛేదో దినమాసాబ్దపాస్తథా" అని తదనంతరశ్లోకపూర్వార్ధముచే సావనమానమునకు వ్యవహారాంతరము చెప్పబడినది. "భూసావనదినాన్యర్కస్యోదయాదుదయంతథా" అని సోమసిద్ధాంతమునందు "సావనంస్యాదిదం భానోరుదయాదుదయంభవేత్। తదేవభూదినం వారస్స్వదేశార్కోదయాదితః॥ వారస్స్యాద్దేకవారంహి ప్రాచ్యాంతు రవిసంక్రమః॥ దేశాంతరచరప్రాక్తై స్స్వదేశార్కోదయస్స్ఫుటః॥ దినరాత్రిప్రవృత్తిస్స్యాద్దృష్టేనతిదివాకరే। తమీవాథోత్తరార్ధాద్యాతనోహంతానదర్శనే। ప్రాణానాదాయభూతానాం యతోఽప్రదేదితపన్రవిః। తత్రప్రాచీత్రివిజ్ఞేయా వారాదిస్స్యాన్నసంశయః॥ అస్తమేతిప్రతీచీస్స్యాద్వారస్స్యార్ధాదిరత్రిహి॥ అని వాశిష్ఠసిద్ధాంతమునందు॥ "అథ సావనమానేన వాసరాస్సంప్రకీర్తితాః। తేచార్కోదయయోరేవవివరేతు సమాస్మృతాః॥" అని పులస్త్యసిద్ధాంతమునందును ఉన్నవి. ఇందువలన స్వదేశ సూర్యోదయాదవ్యగ్రిమ సూర్యోదయకాలపర్యంతము సావనదినము. వారముగూడ సావనదినమేయని స్పష్టపడినది. ఇదియునుంగాక శ్లో॥ స్యుస్తిస్రస్తిథయోవారే ఏకస్మిన్నవమాతిథిః। తిథిర్వారత్రయేచైవ త్రిద్యుస్పృక్త్వవినిందితే॥ అను వశిష్ఠవచనము- ఏకస్మిన్వాసరే తిస్రస్తిథయస్స్యాత్క్షయాతిథిః। తిథిర్వారత్రయేప్యేకాత్వధికాద్వే వినిందితే॥ అను నారదవచనము- యత్రైకస్స్పృశతి తిథిద్వయావసానం వారశ్చేదవమదినం తదుక్తమాద్యైః॥ అను శ్రీపతివచనము- ఏకస్మిన్సావనేత్వహ్ని తిథీనాం త్రితయంయదా। తదాదినక్షయః ప్రోక్తః॥ అను వాశిష్ఠవచనము- తిథ్యంతంయదిసూర్యస్స్పృశన్నదితోన్యవాసరంచాపి। అని వరాహవచనము- ఏకాదశీ ద్వాదశీచ రాత్రిశేషేత్రయోదశీ। తదా దినక్షయః ప్రోక్తః॥ అను స్మృత్యంతర వచనమును ఉదయాద్వాసరారంభమునే స్థి

రవరచి అట్టివారమే కర్మార్హమనికూడ వ్యక్తపరచుచున్నవి. ఇట్లనేక శ్రుతిస్మృతిపురాణ సిద్ధాంతవచనములచే ఇనోదయద్వయాంతర్వర్తి కాలము సావనాహోరాత్రమనియు అదియే వారమనియు స్పష్టపడినందున ఆచార్యులవారికి సంమతమగు అర్ధరాత్రాది దినవారారంభము శ్రుతిస్మృతిపురాణసిద్ధాంతసంహితాబాహ్యమని నిశ్శంకఁ వక్కాణించెద.

"ఏవూరిలో సూర్యోదయము ఆవూరికేవారమని పామరులవలె" అని నిర్వాణవాక్యముగదా, "దేశాంతరచరప్రాప్తై స్స్వదేశార్కోదయ స్స్ఫుటః। సావనంస్యాదిదంభానో రుదయాదుదయంభవేత్। తదేవ భూదినంవారస్స్వదేశార్కోదయాదితః" అను వాశిష్ఠవచనమువలన దేశాంతరచరాసువులు దేశభేదముచే భిన్నమగుటవలన దృష్ట్యస్థితిని పురస్కరించుకొని సూర్యోదయముకూడ భిన్నకాలికమగును. అందువలన వారారంభము దేశభేదముచే భిన్నమగుటకూడ శాస్త్రసంమతమే కాని పామరవచనముకాదని తెలియదగినది.

"ఉదయాదివారమును చెప్పు ప్రాచీనగ్రంథములన్నియుయమకోటి సూర్యోదయమునే చెప్పునని స్పష్టము" అనిగదా నిర్వాణవాక్యము- సూర్యసోమబ్రహ్మవశిష్ఠసిద్ధాంతములు సూర్యోదయాదివారప్రవృత్తిని చెప్పినవి. ఈ గ్రంథములు భారతవర్షములోనివిగాని భద్రాశ్వవర్షీయములు కావు. ఏమన "రాక్షసాలయ=సరః" ఇత్యాది శ్లోకములచే భారతవర్షీయ భూమధ్యరేఖను చెప్పుటవలన "చత్వారిభారతేవర్షే యుగాన్యత్ర మహామునే। కృతం త్రేతా ద్వాపరశ్చ కలిర్నాన్యత్ర" అను వచనముచే భారతేతరవర్షములయందు యుగాదివిభాగము లేకపోవుటవలన పైగ్రంథములయందు మహాయుగమానమును అవాంతర యుగమానమును చెప్పి యుండుటవల్లను- "కర్మభూమిరియంస్వర్గమపవర్గంచ గచ్ఛతాం॥ నఖల్వన్యత్రమర్త్యానాం కర్మభూమౌ విధీయతే" ఇత్యాదిపురాణవచనములు భారతభూమి కర్మాస్పదమని చెప్పుచున్నవి గనుకనే పైగ్రంథములయందు కర్మోపయోగితిథ్యాద్యానయనము

ను- సంక్రమణాది పుణ్యకాలసాధనమును- షడశీత్యాదులును చెప్ప
బడినవి గనుక ఆయా గ్రంథములు భారతీయములని స్పష్టమగుచు
న్నవి. భారతవర్షగ్రంథములయందు భారతవర్షీయవారారంభము చెప్ప
వలెనుగాని భద్రాశ్వవర్షీయవారారంభము చెప్పనవసరములేదు. ఇ
ట్లుండ ఆచార్యులవారు సంగతిని కనిపెట్టక యమకోటిసూర్యోదయమని
వ్రాయుట ఉన్మత్తాలాపమే కాని వేరుకాదు.

గంగా, గోదావరీ, కావేరీ మొదలగు మహానదులలో తెల్లవా
రగట్ల శ్రోత్రియులు స్నానము చేయునపుడు పరవారముగాని పూర్వవా
రము చెప్పుట చూడలేదు. దేవీభక్తులక్రమము నాకు తెలిరియలేదు.'' అ
ని నిర్వాణవాక్యము- శ్రోత్రియులు ఉషస్స్నానమందు పరవారము గ్ర
హించుచున్నందున అర్ధరాత్రాద్యారారంభమే కర్మోపయోగమని ఆచా
ర్యమతముగదా- ఉషస్స్నానసమయమందు పరవారగ్రహణమే శాస్త్ర
సంమతము- అట్లుగ్రహించుటకు కారణ మాచార్యులవారికి తెలియ
లేదు గనుక స్పష్టపరచెద. శ్రోత్రియులవలె వీరు దైనందినోషస్స్నా
తలు కాకపోవుటవలన వీరిట్లనిరనితలంచెద. వీరు దైనందినోషస్స్నా
నపూర్వకముగ నిత్యకర్మాచరణము చేయుచున్నయెడల ఇట్లనరు. ఏమ
న- ఇందుకొక చిన్న ఉదాహరణము చెప్పవలసివచ్చినది. క్షయ సం॥
ఫాల్గుణ బ౩౦ ఆ౫౯|౫౯ ఈదినమం దుషస్స్నాతలు సంకల్పమునం
దు పరవత్సరర్తుమాసపక్షతిథివార సంకీర్తనము చేయుదురు. ఈదినమం
దుషఃకాలమునకు చంద్రుడు సూర్యమండలనిర్గతుడు కాకపోవుటవలన
పూర్వవర్షాదినివృత్తి కాలేదు. అయినను అగ్రిమవర్షాదికీర్తనము చేసెదరు.
ఇట్లు చేయుటకు కారణము శ్రోత్రియులకు విశదమేకాని ఆచార్యులవారి
కి కొంచెము బోధించవలసియున్నది. ''సంధ్యాస్నానం'' అనుశ్లోకో
క్త దైనందిన నిత్యకర్మషట్కము. అందు శ్రు॥ ''ఉదితే సూర్యే ప్రాత
ర్జుహోతి శ్రు॥ ఉదిత ఆదిత్యే'' అనుశ్రుతులచే ప్రాతర్హోమ బ్రహ్మ

యజ్ఞాదికము స్వసూర్యోదయోత్తరకాలికములు- "స్నానమూలాః క్రి
యాస్సర్వాః" "అస్నాతో నాచరేత్కర్మ" "సంధ్యాహీనోఽశుచిర్ని
త్యం" అనుస్మృతివచనములవలన స్నానము హోమాది ప్రాక్కాలిక
ము. కనుక పరదినీయనిత్యకర్మప్రవృత్తులగు ఉషస్స్నాతలు తత్కాల
మునకుగల పూర్వవస్త్రాదికమును విడచి కరిష్యమాణకర్మోపయుక్తవస్త్రాది
కమును గ్రహించుచుండిరి. అటువలెనే ఉషఃకాలమునకున్న వారము
నువిడచి కరిష్యమాణ నిత్యకర్మసంబంధి పరవారమును గ్రహించిరిగా
ని అర్ధరాత్రి ద్వారారంభమనికాదు. అని తెలియదగినది.

అర్ధ్వాదికము రాత్రి తృతీయభాగమున సంభవించినచో మనదే
శమందు పరదినగ్రహణము చేయుచున్నారు. అందువలన అర్ధరాత్రిది
వారగ్రహణమనుట యుక్తముకాదు. స్మృతులయం దర్ధరాత్రానంత
రము పరదినమనియు, రాత్రి తృతీయభాగాది పరదినమనియు, ఉదయానం
తరమే పరదినమనియు ఉద్దేశభేదముచే ద్వైవిధ్యముగనున్నవి. తత్తదు
ద్దేశానుసారముగనే ఈదేశమునందు శిష్టజనులాయాస్థలములయం దా
యాస్మృతివచనానుసారముగనే వ్యవస్థచేయుచుండిరి. కాని వారారంభ
మర్ధరాత్రము మొదలని కాదు. ఈవిషయమై అనేకవచనములుస్మృతుల
యందుకలవుగాని గ్రంథబాహుళ్యమగునని ప్రకృతమందు విరమించెద.

ఫలితాంశము.

సిద్ధాంతసంహితాదులవలన స్వదేశసూర్యోదయాదిగనే కర్మోప
యోగ వారారంభమని స్థిరపడినది. ఇందువలన ఆచార్యసంమతార్ధరా
త్రాది వారారంభము శ్రుతిస్మృతి సిద్ధాంతసంహితా విరుద్ధమని తెలియ
దగినది.

---

శ్రుత్యుక్తమార్గనిరతా విబుధా స్సతతం పురా।
సంరక్షితా యయా దేవ్యా బ్రాహ్మీంతాం భావయామ్యహం॥

సావనాహోరాత్ర ప్రశంసా.

షష్టినాడ్యాత్మకం సౌరసావనం దివసంవహి।

ఇత్యర్కశాస్త్రమార్గేణ మయా సమ్యక్ప్రపంచితం॥
తత్సమ్యగ్వీక్ష్య కృష్ణార్యో రోషేణ మహతావృతః।
చింతా వేంకటసూర్యాద్యై స్స్వవృత్తిభి ర్గణకైరపి॥
షష్టినాడ్యాత్మకం సౌరసావనం స్వీకృతం దినం।
ఇత్థం వదన్ తతః పశ్చాత్తిథ్యాద్యానయనాశ్రయం॥
గతాగమ్యాశ్చేతి సౌరసిద్ధాంతవచనం తతః।
సౌరతత్త్వవివేకీయ మఖేతివచనం తతః॥
నృసింహవచనం శేషా ద్వేధార్ధేతి ప్రదర్శ్య చ।
షష్ట్యా త్రైరాశికం యస్మా న్నాడ్య స్సావనస్యైవహి॥
షష్ట్యా త్రైరాశికా భావగ్రంథో లోకే న దృశ్యతే।
ఇత్థం ప్రగల్భయా వాచా స్వనిర్వాణే లిఖన్స్వనః॥
స్వపంచాంగే స్థితా నాడ్య స్సౌరసావనస్యైవహి।
ఏతాన్యూనాధికా మధ్యసావనీభ్యో యతస్తతః॥
ఉదయాంతరసంస్కారా ద్వివరం దూరతాంగతం।
ఇతి స్వకీయనిర్వాణే లిలేఖ తదప్యసత్॥
చింతా వేంకటసూర్యాద్యా గణకా యే ప్రదర్శితాః।
తే త్వాచార్యాదృతా న్మార్గా ద్భిన్నమార్గానుయాయినః॥
స్వల్పాంతరత్వా న్మునిభి ష్షష్ట్యా త్రైరాశికం కృతం।
కర్మోదయాంతరం సౌరేనోక్తం యద్భాస్కరాదిభిః॥
ప్రోక్తం తద్వాసనాశూన్యమితి యత్ప్రాగ్భిరీరితం।
ద్యురాత్రమానం నాడీభి స్సావనీభి ర్న సాధితం॥
శ్రీమత్సూర్యస్య సిద్ధాంతే సోమవాశిష్ఠయోరపి।
అపిచాహార్ధళం రాత్రిదళం తత్రచ సాధితం॥
సమ్యజ్నక్షత్రనాడీభిరేవసర్వత్ర యత్నతః॥

దైవజ్ఞులారా!

గతాబ్దమున నాచే ప్రచురింపబడిన గుణదోష ప్రకాశికయం

దర్శ-సావనదినము షష్టిఘటికాత్మకము కాదని సౌరాద్యార్షసిద్ధాంత మార్గముచే ప్రకటింపబడెను. అందుపైని ఆచార్యులవారు స్వీయనిర్వాణమున పుట౭ కా౨ పం౨౩ లో చింతా వేంకటసూర్యనారాయణ సిద్ధాంతిగారు పరీధావి సం॥ చైత్ర బ౭ సో౬౦౧౦ శ్రీపాద లక్ష్మీపతి సోమయాజులుగారు మొదలగు మరికొందరు సిద్ధాంతులుగూడ స్వీయపంచాంగములయం దిట్లే వ్రాసి రని తమవ్రాతకు నిదర్శనమిచ్చిరి. ఇందుదహరించినవారలలో కొందరు సర్వత్ర దృగ్వాదులు- కొందరు సౌరచంద్రునిలో దశకలోనము చేయువారు-మరికొందరు వారమునకు ఘటీలేఖనము చేయనివారు- కొందరు త్రింశత్కృత్యః అను సౌరాయనాంశలను పరిగ్రహించినవారు- మరికొందరు జ్యోతిస్సిద్ధాంతాయనాంశలను పరిగ్రహించినవారు- కాని వీరి వారారంభాదికము నంగీకరించినవారు కారు. కాన నివియన్నియు వీరికి విరోధములేకదా- ఆచార్యులవారికి పైనుదహరించినవారి నిదర్శనము సావనాహోరాత్రలేఖనార్థమేనా కావలసియున్నది. అది యట్లుండనిండు. సూర్యసావనాహోరాత్రిమానము షష్టినాడ్యాత్మకమని సాధించుటకు "గతాగమ్యాశ్చషష్టిఘ్నా నాడ్యోర్భభుక్త్యంతరోద్ధృతాః" అను సౌరవచనమును- "అథహృతాస్స్వగతైష్యవిలిప్తికా నిజజవేన గతాగతనాడికాః" అను తత్త్వవివేకవచనమును "శేషాద్వేదార్ధశేషాచ్చ షష్టిఘ్నా ద్రవిచంద్రయోః" అను నృసింహావచనమును స్వీయనిర్వాణమునం దుదహరించి ఇచట త్రైరాశికము ౬౦ చే జేయబడినందున దినమునకు ౬౦ ఘటికలనిరిగాని కుదినమునకు౬౦ ఘటికలని ఆర్షవచనప్రమాణ మీయలేదు. సరియేగదా ఇకముందైన నట్టి ప్రమాణ మార్షములయం దివ్వలేరు. అర్క-సావనాహోరాత్రము షష్టిఘటికాత్మకమే యగునెడ "గ్రహోదయ ప్రాణహతాః=స్మృతాః" అని సౌరమునందును- "గ్రహోదయప్రాణహతాః=వక్రిణోః" అనిసోమసిద్ధాంతమందును గ్రహములకు ప్రత్యేక స్వీయసావనాహోరాత్రమానము లెందుకు సాధింపబడినవో వాటిప్రయోజనమేమో వీరికి తెలియలే

దని నిశ్చయించవలసియున్నది. ఏమన- గ్రహోదయప్రాణహతా” అను సూర్యసోమసిద్ధాంతవచనములకు “ప్రయోజనము చెప్పవలసియున్నది. ఈ అసువులు ౬చేభాగించిన నాక్షత్రవిఘటియలు వచ్చును. వాటిని ౬౦చే భాగించిన నాక్షత్రఘటికలు వచ్చునుగాని సావనఘటీవిఘటికలు రావు. ఈనాక్షత్రఘటికలు ౧ అర్కసావనమందుండును కాని ఇవి సావనములు కావు.” అని స్వీయనిర్వాణమున పుట౭ కా౩ పం౧౮ యం దిట్లున్నదిగదా- పైనుదహరించిన సూర్యసోమసిద్ధాంతవచనములకు ప్రయోజనము వీ రేమిచెప్పిరి. “వచనాన్నివృత్తిః వచనాత్ప్రవృత్తిః” అను న్యాయానుసారముగ ప్రయోజనము వచనపూర్వకముగ చెప్పదగినదికాని వెర్రిమొర్రి మాటలచే చెప్పిన పిచ్చిమాటలని బుధులూహించెదరు. కనుక ప్రయోజనము సప్రమాణముగ వ్యక్తపరచెద. “గ్రహోదయ ప్రాణహతా” అను శ్లోకముచే గ్రహములకు స్వీయసావనాహోరాత్రమును సాధించి- పిమ్మట తదవ్యవహితోత్తరములగు క్రాంతిజ్యా విషువద్భాఘ్నీ- ఇత్యాది శ్లోకములచే గ్రహములకు స్వీయదినార్ధరాత్ర్యర్ధములను సాధించిరి. అందు “స్వాహోరాత్ర చతుర్భాగే” అనుటవలన స్వీయాహోరాత్ర చతుర్థాంశము దినరాత్ర్యర్ధములను సాధించుట కవసరమగుటవలన ముందు గ్రహసావనాహోరాత్రము సాధించవలసివచ్చినది. కనుక నే- “మిథునోదయాసుభిరర్కగతింహత్వా ఏకరాశ్యాసుభిరాప్తాసవః ౫౯ చక్రాసుభ్యస్సంయోజ్య రవేరహోరాత్రాసవః ౨౧౬౫౯ తచ్చతుర్భాగాసవః ౫౪౧౪।౪౫ చరజ్యా౩౮౫।౦ ఉత్తరగోళేయుక్తేనే స్వాహోరాత్రచతుర్థాంశే భవతః దినదళాసవః ౫౭౯౯।౪౫ రాత్రిదళాసవః ౫౦౨౯।౪౫ దినార్ధం౧౬।౭ రాత్ర్యర్ధం ౧౩।౫౮ అహః ౩౨।౧౪ రాత్రిః౨౭।౫౬” ఇట్లు సౌరవ్యాఖ్యానమగు యల్లుభట్టీయమందున్నది. పైనుదహరించిన అహోరాత్రిమానములయోగము సూర్యసావనాహోరాత్రప్రమాణ ఘటికాది ౬౦।౧౦ ఐనది. ఇదిగాక “దినదళం౧౭।౯ రాత్రిదళం౧౨।౫౬ దినమానం౩౪।౧౮

రాత్రిమానం౩×।×౩ అనయోరోగ్యగః౬౦।౧౦ జాతం సూర్యసావనా హెూరాత్రమానం'' ఇట్లు భూధరీయవ్యాఖ్యానమందున్నది. ఈరీతిచే సాధించిన నిశార్ధమునందే వక్ష్యమాణతిథ్యాది ఘటికలావ్యాఖ్యానమందు నంస్కరించి యున్నవి. కనుక ఆవ్యాఖ్యానములు చక్కగ తెలిసికొనిన అహెూరాత్రమానము ౬౦ ఘటికలే ఉండవలెను. అను వెర్రి ఆచార్యులవారికి కుదురును. "ఈయంతరము ఉదయాంతర కర్మవల్ల దూరమగును" అని ఆచార్యులవారి నిర్వాణవాక్యము ఉదయాంతరము సౌరసంమతము గాదనియు భాస్కరానీతమనియు కమలాకరునిచే అనద్వానహ్రాంతమని నిరసించబడినదనియు- ఇదివరకు వ్రాయబడినది గనుక ఉదయాంతరము చేయదగదు గనుక వీరి తిథిఘట్యాదికము సాంతరమే యగును. "చేత్సావనాః ప్రష్టు రభీష్టనాడ్యః" "లగ్నార్ధమిష్టఘటికా యదిసావనాస్తాః" అను శిరోమణిశ్లోకములను బాగుగ తాము మన్ముల యల్లుభట్టీయాదుల చదువుకొమ్మనునట్లు తాము చక్కగ దెలిసికొని భావింపంచాంగ మిట్టి జగద్విరుద్ధము లేకుండునటుల చేసికొందురని నమ్మిక మాకులేదు'' అని స్వీయనిర్వాణమున పుట౭ శా౩ అంత్యపంక్త్యాదిగానున్నది. చేత్సావనాః అను స్థలమునందుగల చేత్- అను పదమునకును-ఇష్టఘటికాయదిసావనాస్తాః''అనుస్థలమునందుగల యది అనుపదమునకును అర్థము తెలిసినయెడల వీరిట్లు వ్రాయరు. స్వల్పాంతరమగుటవలన ౬౦చే త్రైరాశిక కరణమువల్లను దూరచాలనమువల్లను కలిగిన అంతరము తాత్కాలికీ కరణమువలన శమించును. గ్రంథబాహుళ్యముగున ని ప్రకృతమందు విరమించితి.

ఫలితాంశము.

సూర్యసావనా హెూరాత్రమానము ౬౦ నాక్షత్రఘటికల పరిమితి గలదికాదని సౌరాద్యార్షసిద్ధాంతములచే సిద్ధించుచున్నందున దినరాత్ర్యర్ధములుగూడ నాక్షత్రఘటీమాన సిద్ధములు. తిథ్యాదిగతైష్యఘటికలు నాక్షత్రములుకానియెడల దినరాత్ర్యర్ధములయందు సంస్కారాసర్హము

లగును గనుక స్వల్పాంతరమగుటచే గతైష్యఘటికాది సాధనమునం దుటంచే త్రైరాశికము చేయబడినదికాని సావనఘటీ సాధనార్థము కాదు. ఆచార్యులవారికి సౌర సావనాహోరాత్రమానము తెలియలేదని నిశ్చయముగ తెలిసికొనతగినది. కనుక "మానానభిజ్ఞులు దైవజ్ఞులెట్లగుదురు." అను గుణదోషప్రకాశికా వచనము యథార్థమని బుధులంగీకరించెదరు.

శ్రీమాతైవ ధ్యేయా జ్ఞేయా శ్రుత్యగ్రతో భజతాం।
భుక్తిర్ముక్తిర్యస్మా త్కరకమలగతా సదా తస్మాత్॥

సౌరరవిచంద్రాదిప్రశంసా.

పంచాంగనిర్ణయే దృష్టాస్స్పష్టాస్సూర్యసుధాకరాః।
సౌరోక్తవాసరస్యాదౌ నైవేతి ప్రాక్ప్రపంచితం॥
భుజోదయాంతరాఖ్యాభ్యాం క్రియాభ్యాం పరిసాధితే।
వారప్రవృత్తికాలే తేత్వితితస్యాశయో మహాన్॥
వారప్రవృత్త్యానయనే న స్వీకార్యం భుజాంతరం।
కించోదయాంతరమపి కర్మసౌరోక్త్యభావతః।
తస్మాత్సౌరోదితాస్సాగ్రా ద్భిన్నా అర్కసుధాకరాః॥

"౪౮ పుటలో వారప్రవృత్తికాలిక దైనందినీయసౌరరవిచంద్రులను కనపరచియుండిరి. ఆరవిచంద్రులు "వారప్రవృత్తిః ప్రాగ్దేశే" అను సౌరోక్తరీతిచే సాధితమైన వారారంభకాలికులు కారు. పంచాంగనిర్ణయమందు కనపరచబడిన ఆర్షవిరుద్ధమైన వారారంభకాలమునకు యథాశ్రుత సూర్యసిద్ధాంతపాఠముచే సాధింపబడిన స్ఫుటరవిచంద్రులై యుండిరి. అని గుణదోషప్రకాశికయందు ప్రకటించి ఉదాహరణము గనపరచిరి. అందుపైని "యథాశ్రుతసూర్యసిద్ధాంతపాఠము" అనగా వీరిగురువులు వీరును దిద్దిన కర్ణానుపాతపాఠము గాదని కాబోలు వీరితాత్పర్యము" అని నిర్వాణమున పుట౪౮ కాం౧ పం౩౩ లో వ్రాసిరి. ఇందువలన వీరి శ్రుతిద్వేషము ప్రధానముగ జూపట్టుచున్నది. భుజోదయాంతర సంస్కారములను గూర్చి వారప్రవృత్తిప్రసంశయందు వి

స్మరించి వ్రాయబడినది. భుజోదయాంతరము లార్ష విరోధములగుటవలన వారప్రవృత్తిసాధనార్థ ముపయోగించవు.

"మేము భుజాంతర మే గ్రహములలోను సంస్కరించలేదు. ఎంత వెళ్లియూహను చెండరో వీరిమధ్యరవియే మాకును ౧౧।౫।౧౭।౫౭ వీరి ఫలమేమాకును=+౭।౭।౪౩ ఇదుగో మారవి ౧౧।౭।౭౦।౪౦ ఇచట మేము భుజాంతర మెక్కడ సంస్కరించినాము" అని నిర్వాణపుటల కా౭వ౧౭౯ యందున్నది. వీరిఫలమంశాదిధనము ౭।౭।౪౩ "అర్కబాహుఫలాభ్యస్తా" అను సౌరోక్తరీతిచే సాధించిన భుజాంతరవికలాది ధనము ౭౧ ఇవి ఆచార్యులవారి మతప్రకారము సూర్యునియందు ధనము చెయ్యవలసియున్నది. ఇచట చైత్రశు౭ బుll లంకార్ధరాత్రము ౪౫।౦ వీరి యూహాంశలప్రకారము ప్రాగ్దేశాంతర ఘట్యాదికము ధనము ౧।౧౬ వారప్రవృత్తికాలము ౪౬।౧౬ ఇది సౌరోక్తవారప్రవృత్తికాల మయియున్నది. భుజాంతర ధనవికలలు సూర్యునియందు ౭౧ గదా వచ్చినవి. వికలలను విఘటీసమములుగ భావించి వారప్రవృత్తికాలమగు ౪౬।౧౬ లో విలోమముగ సంస్కరించిన వారప్రవృత్తికాలము ౪౫।౫౫ అని ఆరోజున వీరి పంచాంగమునందు వ్రాసిరిగదా- ఇందువలన భుజాంతరము గ్రహోద్విలోమముగ కాలములో సంస్కరించుటవలన గ్రహములో సంస్కరించిరని సిద్ధమగుచున్నది. "గ్రహేర్కవద్బాహుఫలం కలాసు" అను కమలాకరవచనస్థగ్రహపదమునకు సూర్యేతర గ్రహములయందని యర్థము.

### సౌరభేదప్రదర్శన ప్రశంస.

పంచాంగనిర్ణయమునందు సిద్ధాంతపంచాంగము సూర్యసిద్ధాంత సంమతముగ నుండలేదని గుణదోషప్రకాశిక యందు౧౯౩౪శకమునందు వైశాఖకృష్ణైకాదశీ ప్రమాణమునుగూర్చి అనేక ఉదాహరణము లివ్వబడినవి. అం దొకటిమాత్రి మిచట గనపరచబడును. వైశాఖ బ౧౧ ఆll లంకార్ధరాత్రకాలిక మధ్యరవి౦।౭౨।౭౨।౧౦ మధ్యచంద్రుడు౧౧।

౧౩।౨।౩౦ చంద్రోచ్చము ౯।౯।౫౮।౭౧ ఆచార్యులవారు విశాఖపట్టణ
మున కిచ్చిన దేశాంతరాంశాదికము ౭।౩౫।౩౦ రవికి దేశాంతరకలాది
కము ఋణము ౧।౧౮ చంద్రునకు ౧౬।౮౦ చంద్రోచ్చకు ౦।౯ రవి
మందఫలము ధనము ౧।౮౦।౭౧ స్పష్టరవి ౦।౭౯।౬।౧౩ ౧౫౨।౮ భు
జాంతరము చంద్రునికిధనము కలాది ౩।౪౩।చంద్రమందఫలము ఋణ
ము- అంశాదికము ౮।౩౦।౩ స్పష్టచంద్రుడు ౧౧।౧।౭౪।౩౦ ౧ ౨౫౯।
౫౩ ఉత్తరగచరవినాడికలు ౬౭।౩౦ చరసంస్కృత స్వదేశార్ధరాత్రము
౮౬।౯।౩౦ పై రవిచంద్రులవలన సాధించిన ఏకాదశీ శేషఘటికాదిక
ము ౧౩।౮౯ భానువాసర సూర్యోదయాది ఏకాదశ్యవసానము౫౯।౪౧
౩౦ వచ్చినది. ఇచట ౧౧ ఆ ౬౦।౦ వ్రాసియుండిరి. కనుక సౌరసి
ద్ధాంత భిన్నమని కనపరచబడెను. అందుపైని సూర్యచాలనము అన
గా దేశాంతరసంస్కారములో ౧ వికల చంద్రచాలనము అనగా చం
ద్రుని దేశాంతరసంస్కారములో ౧ వికలయున్న- తప్పుఅని పు౧౦
కాం౧ యందు కనపరచిరి. ఇదిగాక "వీరువ్రాసిన చంద్రమందఫలము
శుద్ధతప్పు" అని పు౧౦ కాం౧ పం౧౯ లో నున్నది గాని మాగణితము
నందు తప్పులేదు. ఆచార్యులవారు కుయుక్తిచే నారోపించిన దోషము-
ఎట్లన వీరిపంచాంగమునందు గనపరచిన తూలాంశలు ౨।౩౫।౩౦ వీటి
చే రవిచంద్రమధ్యగతులను ప్రత్యేకము గుణించి ౩౬౦ చే భాగించగా
దేశాంతర కలాదికము రవికి ౧।౦౮।౪౯ వచ్చినది. ఇచట అర్ధోత్తర
గ్రహణము మేము చెయ్యలేదు. చంద్రునికి దేశాంతరఫల కలాది ౧౬।
౮౦।౧౯ వచ్చినదిగాని ఆచార్యులవారు కనపరచిన ౧౬।౪౧ రాలేదు.
దోషారోపణచేయుటకు ౨।౩౫।౩౦ తూలాంశలకు బదులుగా ౨।౩౬ గ్ర
హించి చాలనఘటికలు ౧।౧౬ అనిరి. చాలనఘటికలు గ్రహగతికలలు
సావయవములగుటవలన సకృద్రీతిచే సాధించుట చేతగాక మాగణితమందు
దోషమున్నదని వచించిరి. చంద్రమందఫలసాధనమునుగూర్చి భుజాంత
రము మధ్యమచంద్రునియందు సంస్కరించి ఫలానయనము చేయదగిన

నిగాని చాటుగ మూర్ఖులవద్ద చెప్పలేదు. ఉదయాంతర సంస్కారము సౌరాద్యార్ష సిద్ధాంతములలో నున్నటుల గనపరచుటకు వీరికి యావజ్జీవ మవకాశమిచ్చితిని. "గ్రీన్విచ్- దేశాంతరములో ౧౩ కలలు ప్యారీస్ దేశాంతరములో ౧౫ కలలును తప్పు వీరు వ్రాసియున్నారు-" అని నిర్వాణ పు౧౪ కా౧ పం౧౭ యందున్నది. ఇందువలన డెస్- కెంప్స్ అను గ్రంథముతప్ప యీరాదపుఖండమునందున్న ఇతరగ్రంథములను వీరుచూడలేదు. ఏమన బ్లాక్స్- జనరల్- అట్లాస్- పేజీ౫౪ కా౫ మునందు గ్రీన్విచ్ నగరమునుంచి విశాఖపట్టణ ప్రాగ్దేశాంతరాంశలు ౮౩।౩౧ బ్లాక్స్- జనరల్- పే౩౮ కా౬ మునందు గ్రీన్విచ్ నగరమునుంచి ప్యారీస్- నగరమునకు ప్రాగ్దేశాంతరాంశలు ౨।౨౦ అని యున్నది. దీనిని అనుసరించి గుణదోషప్రకాశికయందు గ్రీన్విచ్- విశాఖపట్టణ దేశాంతర ఘటికాదికము ౧౩।౫౬౫ ప్యారీస్ విశాఖపట్టణ దేశాంతర ఘట్యాదికము ౧౩।౩౭ అని గుణదోషప్రకాశికయందు ప్రకటించితి గనుక డెస్- కెంప్స్- అను గ్రంథ మాత్రమును చూచి మా దేశాంతరాంశలు తప్పనుట అవిచారమూలమే- కనుక గుణదోషప్రకాశికావచనము యథార్థమే.

చాంద్రసంవత్సరమునకు సావనదినములు ౩౫౪. అందు సగము ౧౭౭ సావనదినములు. ఇచట పాశ్చాత్య మతాభినివేశాధిక్యముగల యాచార్యులవారు పెరుమాళ్ళపూజా పారవశ్యముచే మానాన భిజ్ఞులై స్వీయనిర్వాణపుట౧౫ కా౩ పం౧౩ యందు ౧౮౩ రోజులకే యని వ్రాసిరని తలంచెద. అట్టిపారవశ్యము కానియెడల స్వీయపంచాంగీయ చరమదినమందు సంఖ్యయను కాలమునందు ౩౫౪ గే వ్రాసిరిగాని ౩౬౬ వ్రాయలేదుకదా —

చూడామణి విచారము.

"సౌరోదయిక వారపక్షము వారి మతప్రకారము చూడామణిని వ్రాసినాము. సౌరోదయిక అను శబ్దము తొందరవల్ల పడలేదు." అని నిర్వా

ణపుట౧౬ కా౩ పం౧౪ యం దున్నది, ఔదయిక వారపక్షము వారికి చూడామణి లభించినది. అర్థరాత్రివారపక్షమువారికి చూడామణి భంగము కలిగినది యనికదా పైనిర్వాణ వాక్యమున కర్థము. కనుక అర్ధరాత్రివారారంభ పక్షీయులగు ఆచార్యులవారికి చూడామణిభంగము కలిగినది. అను గుణదోషపత్రికా౩కా వచనమున కులికిపడి వీరు ''దురుదితం తద్ద్విషద్భ్యోఽదిశామ్యహం'' అను స్వీయనిర్వాణవాక్యములవలన లుప్తచూడామణులు కాకుందురా- ఔదయికశబ్దము పడకపోవుట తొందరవల్లనో పెరుమాళ్ళపూజాపారవశ్యము చేతనో చింతనీయము.

## గ్రహణవిచారము.

గ్రస్తోదయ చంద్రగ్రహణమున పరదినప్రత్యాబ్దికాచరణబోధకములగు వచనములు పతిపుత్రవిహీనస్త్రీకి గ్రంథక ప్రత్యాబ్దికశాస్త్రపరములని గుణదోషప్రకాశికయందు ప్రచురింపబడెను- ఇది ఆచార్యులవారికి తప్ప సర్వశిష్టజనసంమతమయి వర్ణింపబడుచున్నందున విస్తరించ నవసరము లేదు- '' విధవలు కాని శ్రోత్రియవిద్వాంసులుందరు'' అని నిర్వాణ పు౧౨ కా౧ పం యందున్నది- ఆపదములను చదువునపుడు విధవలగు శ్రోత్రియవిద్వాంసులు కొందరున్నట్లు స్ఫురించక మానదు- ఆపదములను ప్రయోగించుటయం దాచార్యులవారి తాత్పర్యమేమైయుండునో.

## శాస్త్రీయదృక్సిద్ధవిషయము.

''తత్త్వవివేక యంత్రదీపికా వ్యాఖ్యాతలుదృక్సిద్ధవిరోధులని జగద్విదితమే'' అని నిర్వాణ పు౧౮ కా౧ పం౩౨ లోనున్నది. తత్త్వవివేక యంత్రదీపికా వ్యాఖ్యాతలు అను స్థలమందుగల వ్యాఖ్యాతృశబ్దము ద్వంద్వమందుభయపదములతో నన్వయించవలెను. కనుక తత్త్వవివేక వ్యాఖ్యాత యంత్రదీపికావ్యాఖ్యాత యని యర్థము- ఇదివరకు తత్త్వవివేకమునకు వ్యాఖ్యానమున్నటుల నేనెరుగను- వ్యాఖ్యానము లేనియెడల వీరికన్వయజ్ఞానమే లేదని తోచుచున్నది.

శాస్త్రిదృక్కులకు విరోధముకలిగినపుడు అదృష్టఫలములకు శాస్త్రిము ప్రమాణమని బహుగ్రంథములు ఘోషించుచున్నందున శాస్త్రి ప్రమాణము నంగీకరించి కర్మాచరణము చేయుమని బహునంమతికలదు. "దృక్కర్మయు బీజము నొకటియని భ్రమపడి" అని నిర్వాణ పుగార కాగ యందున్నది- దృక్కర్మబీజములు భిన్నములే అట్టి భ్రమనొంది యుండలేదు- మేముభ్రిమపడిత్రి మని ఆచార్యులవారు భ్రాంతినొంది రి- గుణదోషప్రకాశకావచనములు లుప్తశ్రుతులగు వీరికి శ్రుతిగోచర ము కాలేదని తలంచెద.

మందకర్ణవిచారము.

ఆచార్యులవారు నిర్వాణారంభకాలిక శ్లోకమువలన మందకర్ణ ద్వేములని స్పష్టముగ నున్నది. ఈవిషయమై॥ శ్రు॥ "త్రినాభిచక్రమజ రమనర్వం॥" అను శ్రుతివల్లను "త్రినాభిమతిపంచారేషణ్నేమిన్యక్షయాత్మకే। అను పురాణవచనమువల్లను సంవత్సరచక్రము నాభిత్రయ యుక్తము అనగా దీర్ఘవృత్తమని స్పష్టపడినది- అందువలన గ్రహమంద కర్ణములు ప్రత్యహము భిన్నముగానుండునని స్పష్టము- ఇదిగాక గ్రహ ములకు ప్రత్యహము గతిబింబవైషమ్యాదులు గలుగుటకు కారణము దూరసామీప్యములే- ఇదిగాక పాశ్చాత్యులుగూడ డెస్ టెంప్స్ మొదల గు గ్రంథములయందు గ్రహములకు రేడీయస్ ప్రతిదినము విలక్షణము గా నివ్వబడినది- ఆరేడీయస్ అనున్నది గ్రహమందకర్ణజ్ఞానార్థమిచ్చిన సంజ్ఞ. ఇందుకుదాహరణము.

1914 సం॥ రము.

| | | | |
|---|---|---|---|
| జనవరి- | తే 3 | సూర్యుని రేడీయస్ | 99926682 ఇచటరవి నీచగతుడు. |
| ఏప్రెల్ | తే 2 | ... | 99999428 ఇచటనీచోచ్చమధ్యగతుడు. |
| జూలై | తే 3 | ... | 00071988 ఇచట రవి ఉచ్చగతుడు. |
| అక్టోబరు | తే 4 | ... | 00000043 ఉచ్చనీచ మధ్యగతుడు. |

ఇందువలన ఉచ్చనీచములయందు కర్ణము లధికాల్పములు గలిగి యుండును- ఈయుభయమధ్యమమందు కర్ణము మధ్యమముగా నుండును- ఇట్లుండ పాశ్చాత్యమతాభిమానముగల ఆచార్యులవారికి మందకర్ణ విరోధ ముచితముగాదు- ఈవిషయమునుగూర్చి వ్రాసినచో మహాగ్రంథము భారతాదిగ్రంథములను మించును. శ్రుతి నంగీకరింపనివారి కుచ్చనీచాభావము కలుగకుండునా.

సౌరాంతస్తత్త్వవిజ్ఞానాదపి మృత్యుం జయే జ్జనః।
సౌరాంతస్తత్త్వజిజ్ఞాసు ర్యదిత్వం శృణుమద్వచః॥
జగదాత్మా తమోహంతా యస్మాచ్ఛ్రైత్యవగోచరః।
తస్మాత్సర్వప్రయత్నేన మంద శ్రుతిమిహాశ్రయః।
ఇత్థం వేంకటరామేణ ప్రీత్యై జ్యోతిర్విదామిహ।
సౌరాద్యార్షమతేనైవ కృతేయం తత్త్వబోధినీ।
శకే బాణాగ్న్యష్టకుభి (1835) స్సంమితే మాసిఫాల్గునే।
సితేపక్షే పూర్ణిమాయాం దేవేజ్యస్య చ వాసరే॥

సంపూర్ణము.

